# వాసవీ విజయము.

(ఆర్యవైశ్య మహాసభవారి ప్రచురణము.)

గ్రంథకర్త:

శ్రీ విద్వాన్ గర్రె సత్యనారాయణ గుప్త, నెల్లూరు.

మద్రాసు

1944.



[PRICE·RS. 0|8-0]

# దైవప్రార్థనము.

ఉ॥ గుండెలు బ్రద్ద లౌనటులఁ - గుక్కుచు రేయిఁ బవళ్లు పాఠముల్
మొండికి వల్లెవేసినను - మూల్గిన నైన, కవిత్వ మబ్బునే
పండితమౌళికైనను, భ - వత్కృప యింతయు లేక యున్న
నిందు మనంబునన్ దలతు - నీదు సమాదృతి నంద శారదా!

మ॥ వెఱపింతైనను లేక నిచ్చలు జగ - ద్వీరాంక వీరుండ నం
చు రహిన్ మించిన రావణాసుర మహీ - శున్ వంతలన్ముంచియున్
శరమున్ దుఃఖితుఁ జేసివైచి, శ్రిత భ - క్త శ్రేణి హృత్పద్మముల్
మరువన్ జాలక, కంప మొందెదవు, ప్రే - మన్ వాయుదేవాత్మజా!

## అంకితము.

అస్మదన్వయ చారిత్ర - మైన దీని
ఆర్యవైశ్యమహా సభ - నాత్మ నెంచి
అంకితము సేతు వైశ్య మ - హా జనులకు
సానురాగంబునన్ హృద - యాంజలి నిడి.

గర్రె సత్యనారాయణ గుప్త.

# పీ ఠి క.

వాసవీ విజయ నాటకమందు కథ ప్రధానము. ఇందు ధర్మము త్యాగమూలకముగ విజయ మొందినది. వ్యక్తి స్వాతంత్ర్య మగ్రస్థానము వహించినది. సంఘశ్రేయస్సు అను మిషతో నేతివర్తనులగు ప్రజలను నిర్బంధించు విధానము నిరసింపబడినది. వైశ్య వివాహకార్యములందు చేయబడు వాసవీ పూజకును, గోత్రదంపత్యారాధనకును, బాలనగర గౌరవమునకును, వీరముష్టుల వర్తనలకును కారణములు నిరూపింపబడినవి. వాసవీకన్యకను విష్ణువర్ధనునికి ఇయ్యక పోవుటకు గల హేతువులు స్పష్టపరుపబడినవి. భాస్కరపండితుడు గుండప్రవేశ కాలమున నుండినవాడు కాడు. కుసుమసెట్టి నాటి ౧౦౨ గోత్రములు (వంశములు) ౧౫౦ గ పెరిగిన పిదప భాస్కరుడు వైశ్యపురాణమును వ్రాసి తామరవాడ యను అగ్రహారమును దక్షిణగ గ్రహించెను.

2. పెనుగొండ నగర స్వాములకును తక్కిన పదునేడు నగరములవారికిని పొడమిన భావభేదములె ప్రస్తుత ప్రపంచ యుద్ధ కారణములైన సిద్ధాంత భేదములుగ విజృంభించినవి. నాజి ఫాసిస్టు ప్రభుత్వములందు ఆధిపత్యమును వహించిన నియంతలు ప్రతిపక్షుల నోర్లు కట్టి వారిని అణచి వేయుదురు. ఈ సిద్ధాంతమే అక్షరాజ్యములందు వ్యాపించి, వ్యక్తి స్వాతంత్ర్యమునకు భంగకరముగ నేర్పడుటచే ప్రజా స్వాతంత్ర్య నిరతులగు మిత్రమండలి వారు ధర్మసంస్థాపనార్థము యుద్ధమునకు దీకొనవలసి వచ్చినది.

3. వాసవీవిజయ కథకు నేనుత్తరవాది నగుటచే దానిని నిర్ణయించిన విధమును తెలుపుట అవశ్యక మగుచున్నది. వైశ్యుల పూర్వచరిత్రను పరిశోధింపవలెనను తలంపు నాకు విద్యార్థిదశాంతమందు పొడమెను. కాని త్వరలో నేనుద్యోగమందు ప్రవేశించుటచే ఈ యభిలాషను తీర్చుకొన జాలకపోతిని. ఉద్యోగమును విరమించిన తర్వాత

పురాతన నాగరికతా చరిత్రలు చదువుట ప్రారంభించితిని. సుమేరియా, ఈజిప్టు, అస్సిరియా, అనటోలియా, అరేబియా, క్రీటు, గ్రీసు, దేశముల చరిత్రలను మాత్రమేగాక, హిందూస్థానము, ఇండొచైనా, చైనా మొదలగు దేశముల పూర్వ చరిత్రలు కొంత కొంత మట్టుకు తెలిసికొంటిని. వైశ్యులకు సంబంధించిన గ్రంథములను, శాసనములను, మాసపత్రికల లో వెలువడిన వ్యాసములను పరిశోధించితిని. అప్పటప్పటికి నేను గ్రహించిన విషయములను 'వాసవి' పత్రికలో ప్రకటించుచుంటిని. ఇట్లు పది సంవత్సరములు కావించిన పరిశ్రమ ఫలితముగ, తపో్ప యొపో్ప యొక నిర్ణయమునకు వచ్చితిని. ఈ నిర్ణయము కొంతవరకు ఇచ్చట నుదువదగి యున్నది. మంగోలు జాతికి చెందిన టిబెటొబర్మను శాఖలోని తెగలు హిమాలయ ప్రాంతములందు నివసించుచున్నారు. ఇందులో "తై - శాన" తెగ యొకటి. "తై" తెగ నుండియే సయాము దేశమును "తైలాండు" అని కూడ చెప్పుచున్నారు. శాన రాజ్యములు ఉత్తర బర్మాయందు వెలసియున్నవి. ఈ తెగలలో ఒక తెగకు "ఖాంటీ" అని పేరు. వీరు మణిపురమునకు తూర్పున ఉత్తరబర్మా దేశమందలి "పతకోయి" కొండలయందు నివసించుచున్నట్టి యొక స్వచ్ఛమైన తెగవారు. ఈ తెగవారికిని మణిపురాధీశ్వరులకును అప్పటప్పటికి పోరాటము కలుగుచుండెను. కొంత కాలమునకు ఖాంటీలలో కొందరు బంగాళా దేశము చేరి ధార్ల నదియొడ్డున "కామటిపుర" మను కోటను కట్టుకొని, అందు "కామ త్యేశ్వరి" దేవతను స్థాపించి, కామటిపుర రాజ్యమును స్థాపించిరి. ఈ రాజ్యమునకు "కోమటె" యనియు, రాజ్యాధిపతికి "కోమటేశ్వరు" డనియు పేర్లు ఏర్పడెను. ఇతర భాషలందలి "అ"కారము బంగాళీయందు "ఒ" కారముగ మారుట తరుచు చూచుచున్నాము. కామటిపురపుకోట సిధిలమై యిప్పుడు కూడ కోచి - బీహారు సంస్థానములో చేరియున్నది. 'కోమటె' రాజ్యపువిస్తీర్ణము చూపు పటమొకటి హాలెండుకు తీసుకొనిపోబడి, అచ్చట భద్రపరుపబడియున్నది.

టిబెటో బర్మాజాతికి చెందిన తెగలె మన పురాణములందు యక్ష గణము లని చెప్పబడినవి. వీరు పీతవర్ణులు, మాతృ దేవతారాధకులు. వీరి రాజులలో ''కుబేరుడు'' ప్రధానుడు. అమరకోశమందు కుబేరుడు "ఏక పిఙ్గుడు" (పింగళ వర్ణముగల యొకడు) అని చెప్పబడి యున్నాడు. కుబేరవంశజులగు కబ్బేరులు కావేరీనదీ తీరమువరకు వ్యాపించి, ఆ నదికి తమ నామధేయము నిచ్చియున్నారు.

పెనుగొండ యిప్పుడు పశ్చిమగోదావరిజిల్లాలోని యొక గ్రామము, ఇది వైశ్యుల పూర్వనివాస మని నమ్మబడుచున్నది. ఇందు నగరేశ్వరాలయము కలదు. అందొక ప్రక్కను కన్యకా పరమేశ్వరీ శిలా విగ్రహము స్థాపింపబడియున్నది. అగ్నిగుండములు త్రవ్వబడినచోటు యాత్రికులకు చూపబడుచుండును, కోటగోడలు సిథిల మగుటచే ఇప్పుడుకనబడుట లేదు. సమీపమున పారుచుండిన గోదావరినది కొంతదూరమునకు తరలి పోయినది. గోదావరి కాలువ మాత్రము సమీపమున నున్నది. చదును ప్రదేశములో వెలసిన నగరమునకు "పెనుగొండ'' యను పేరు ''పతకోయి'' నుండి వచ్చిన దని నా నమ్మకము. ఈ కొండలు చాల యెత్తైనవి, ''పతకోయి'' శబ్దము ఏ భాషలోని దైనదియు దాని యర్థ మేమైనదియు నాకు తెలియక పోయినను, ఆ పదములకు అర్థము 'పెద్దకొండ' యని తోచుచున్నది. 'పత' శబ్దముయొక్క రూపాంతరమే 'పెద్ద' అయి యుండవచ్చును, 'కోయి' అనగా కొండ కావచ్చును. కొండలలో నివశించు కోయవారు కలరు. పెనుగొండ నగరస్వాములు తాము కుబేర వంశజుల మైనట్లు శాసనములలో వ్రాసుకొనియుండిరి. ఘాంటిశబ్దము మొదట "కామటి" గను, పిమ్మట "కోమటి'' గను మారినట్లు నమ్ముటకు కారణములు కనుపించుచున్నవి, పెనుగొండ నగరస్వాములు ఘాంటిశాఖవా రని నమ్ముటకు కారణము లి ట్లేర్పడినవి. ఈ కోట యేర్పడిన పిదప, దాని సమీపప్రాంతములందు మరికొన్ని వర్తక సంఘములు చేరి, ౧౨ కోటలను కట్టుకొని, పెనుగొండ నగరస్వాములతో కలసి వర్తకము సాగించుకొనుటయే

గాక, వారి మాతృ దేవతారాధనమందును; తదితర కార్యక్రమమందును పాల్గొనుచు ఏక సంఘముగ మెలగుచుండిరి.

వైశ్య పురాణమందు చెప్పబడిన విష్ణువర్ధనుడు విమలాదిత్యుడుగ నుండవలెను. ఇతడు మరణించినది క్రీ. శ. 1022 వ సం. లో. వైశ్యపురాణము వ్రాయబడినది. "కల్యాబ్ది గణేష్ట నేత్ర రస దిక్సంఖ్యాగతే వత్సరే" అని శాసనమందు కలదు. ఇది కలియుగ 4628 వ సంవత్సరము క్రీ. శ. 1526 వ సంవత్సరము ను అగును. కన్యకాపురాణ మని సంస్కృతమున నున్నది స్కాంద పురాణాంతర్గత సనత్సుజాత సంహితలోనిదగుటచే, దీని నెవ రెప్పుడు వ్రాసినది తెలియుట లేదు, కాని వైశ్యపురాణమునకంటె నిది ప్రాచీన మని తోచుట లేదు.

వైశ్యులు కైలాసగిరియందు నివసించుటయు, వారికిని మణిపురాధిపులైన గంధర్వులకును కలతలు కలుగుటయు, పిమ్మట వైశ్యులు భూలోకమునకు వచ్చుటయు పురాణమందు కనబడు గాథలె. కైలాసగిరికి బదులు "పతకోయి" కొండయు, భూలోకమునకు బదులు గోదావరీ ముఖసమీప మందు సముద్రజల మట్టమున నున్న సమ ప్రదేశమును పొందుపరచినయెడల పుక్కిటి పురాణము చరిత్రాంశముగ మారును.

హిందుస్థానము చేరిన ఆర్యజాతిలో వర్ణ విభజన జాతి ననుసరించి వచ్చిన దేహచ్ఛాయా భేదముతో ప్రారంభించి, కొంతకాలమునకు వృత్తి భేదముగ మారినది. ఏ రంగుగలవారైనను ఒక వృత్తియం దుండువారు ఆచారవ్యవహారములందును అంతస్థునందును సమానులై సంబంధ బాంధవ్యములకు తగియుండి, అందుకు నిచ్చగించుచుందురు. అనార్యసంఘములును విదేశీయులును కూడ వారి వృత్తి ననుసరించి బ్రాహ్మణులుగనో, క్షత్రియులుగనో, వైశ్యులుగనో పరిగణింప బడి నందుకు అనేక దృష్టాంతములు చూడనగును. పెనుగొండ వాసులు కుబేరవంశజులు, ఖాంటీశాఖవారు, మాతృదేవతారాధకులు. వీరిలోకొందరు జైనమతమును స్వీకరించినట్లు తలచుటకు శాసనములు కలవు. వాసవీ

గుండ ప్రవేశానంతరము పెనుగొండ నగరస్వాములు త్రిమూర్తిప్రధాన మైన వివిధదేవతా విగ్రహారాధనతోను వర్ణవివక్షతతోను షోడశ సంస్కారములతోను గూడిన పౌరాణిక మతమును గ్రహించి, ద్విజులై సర్వ సంస్కారములను పొంది, శ్రుతి స్మృతి పురాణ శాస్త్రములను చదువ దొడంగిరి.

। వీరి గోత్రములు ప్రాచీనములు. ఆర్యులందును మృగ వృక్ష సూచకము లైన పేర్లు పురుష వాచకములుగ మారినందుకు 'శౌనక' 'జంబుక' 'మాండూక్య' 'బాదరాయణ' మొదలగు ఋషి నామములు నిదర్శనములు. అట్టి మార్పులే కన్యకా పురాణమందలి ౧౦౨ గోత్రము లందును ప్రారంభించినను అవి సంపూర్తి కాలేదు. శాక్తేయులకు వర్జిత ములు ఆదినుండియు వచ్చినవి. గోత్ర చిహ్నములైన మృగ వృక్షములే వర్జిత పదార్థములుగ ఏర్పడినందుకు దృష్టాంతములు కలవు. గోత్ర మనగా కుటుంబము, వంశము, తెగ, ఒక ఆవరణయందు నివసించుచుం డినవారు-అని భావము. ఒక కుటుంబమువారు ఒక మృగమునో ఒక వృక్షమునో పూజనీయముగ గ్రహించి, తమ కుటుంబమును దానిపేరట చెప్పుకొనుచుండిరి. వైశ్యపురాణము వ్రాయబడినపుడు ఆయా కుటుంబ మోలపేరు చేసియుండిన దాన ధర్మములు, నిష్టలు, ప్రతిష్ఠాపనములు, మొదలగు వానినిపురస్కరించుకొని, లింగము, తటాకము, తపస్థానము, క్షేత్రసంఖ్య, దీపసంఖ్య, జపసంఖ్య. ఇష్టదేవత - ఇట్టి సాంకేతికములను నిర్ణయించుకొనగా, గోత్ర ఋషి వర్జితములతో చేరి 'దశలింగములు' ఏర్పడినవి. ఇవి యన్నియు వైశ్యత్వము నొందిన పెనుగొండవాసుల ప్రత్యేకతను వ్యక్తపరచుట కని తోచుచున్నది.

4. ఇట్టి కథను నేను నిర్ణయించుకొని, కన్యకాచరిత్రను చలన శబ్ద చిత్రముగా తీయుటకు తగినవారికి అధికార మియ్యగలందులకు ఆర్యవైశ్య మహాసభవారికి కేంద్రసభవారికి సలహా నిచ్చితిని, గాని వారం దుల్ల కంగీకరింవకపోయిరి. పెనుగొండ వైశ్యుల పూర్వ చరిత్ర మెట్లు

న్నను, వాసవిచరిత్రయైన గౌరవప్రదముగ చెప్పుకొను టకు తగినట్లు వ్రాయుట ఆవశ్యక మని కేంద్రసభవారిని ప్రోత్సహించగా, నేను ఏర్పర చిన రీతిని ఒక చిన్న నాటకమును వ్రాయు వైశ్య కవికి రు ౧౧౬ లు బహుమతి నిచ్చుటకు వారు తీర్మానించిరి. ఈ తీర్మాన ప్రకారము గ్రంథ రచనకు బూనుకొన్నది శ్రీ విద్వాన్ గర్రె సత్యనారాయణ గుప్తగా రొక్కరే. కథాక్రమములో వలయు భాగమును అంకములుగను రంగము లుగను విభజించి, ఏ రంగమందు ఏ విషయములు ఎట్టి భావములు రాదగి నదియు వివరించి చెప్పి, సత్యనారాయణగుప్తగారిని రచనకు దింపితిని. వీరు బాలకవులు, ప్రారంభదశయం దున్నవారు. ప్రోత్సాహమున క ర్హులు, సంఘాభిమానము సేవాకుతూహలముకలవారు. వాసవీ విజయ మందలి ర చన యంతయు వీరిదే. శైలియు రసపోషణమును వీరివే. నేనువచనమం దు వలయు సవరణలు విపులముగ జేసి, ఆరుపాదములుగల ఒక సీసపద్య మును మొదట ఇమిడ్చితిని. శ్రీ శిఖరం కోటీశ్వర గుప్తగారు పద్యము లలో అక్కడక్కడ సవరణలు చేసిరి. శ్రీ దోమా వేంకటస్వామి గుప్త గారు ఇట్టి సవరణనే చేసి ఒకపద్యమును 20వ పుటయందు చేర్చిరి. వీరికి సత్యనారాయణ గుప్తగారితో పాటు నేనును కృతజ్ఞతా పూర్వక వందన ములు అర్పించుచున్నాను. ఆర్యవైశ్య సంఘము సత్యనారాయణగుప్త ప్రణీతమైన ఈ గ్రంథమును చదువుచు, శ్రావ్య మగు వారి స్వరముతో ఈ కథను వినుచు, వారిని ప్రోత్సహించగల రని విశ్వసించుచున్నాను. వినుతి గాంచిన కవు లెవ్వరైన ఈ గ్రంథమును మరి కొంత ఆహ్లాదజన కముగ వ్రాయబూనినచో శ్రీ సత్యనారాయణ గుప్తగారును నేనును కృతజ్ఞులు మగుదుము.

'సత్యనివాసం'
త్యాగరాయనగరం
మద్రాసు, 22-7-44.

తుంపూడి భగవన్తమ్.

# తొలిపలుకు.

చిన్ననాటనుండియు నాకుఁ గైతపిచ్చి గలదు. కవితా ప్రారంభమున నాకుఁ దలుపుచెక్కలు నల్లబొగ్గులే పరికరములుగ నుండెను. "శ్రీరుక్మిణీశ! కేశవ" అను పద్యముఁ బఠించి "శ్రీ పార్వతీశ! యీశ్వర" అని వ్రాయఁ బూనువాఁడను. ఒప్పులు తప్పులు నాకుఁ దెలియవు గాని మహాకవి భవభూతి వాక్రుచ్చినట్లు, "తే హి నో దివసాః గతాః" అయినను, ఆ వాసన నాహృదయము నావరించియే యున్నది. ఆ నాఁడే కొన్ని చిలుకబ్బములను గూడ విరచింపఁ గలిగితిని. రాను రాను విజ్ఞుల సాంగత్యమున భాషాస్తవమును దిలకించి యబ్బురపడితినే కాని, నే నందొక్క తుంపరనేని జీర్ణించుకొనలేను. కవితా వాసన నన్నుఁ బాయలేదు.

వాయువశమున నలుగడల వ్యాపించు దివ్యపరిమళ మట్లు, నైసర్గికావేశమున నప్పుడప్పుడు నుప్పొంగి పొరలి వచ్చెడి కవితా ప్రవాహమును బ్రతిబంధించు శక్తి ప్రపంచమున దేనికినీ లే దనియే చెప్పవచ్చును. కాని, పాండిత్య విరమిత కవిత రాణింపజాలదేమో యని నాచిత్తము పరిపరి విధముల శంకించుచున్నయది.

"నాటకాంతం కవిత్వమ్" - అని పెద్ద లన్నటుల కవితా శాఖా సోపానమొనర్చి, రచనా పాటవమునఁ గృతహస్తులగు వారుగదా ఇట్టి రూపక రచనకు బ్రద్ధంగ వలయు నని పాఠకులు నన్ను ప్రశ్నింప వచ్చును. అందుకు నా యీ మనవిని జిత్తగింపుఁడు. అఖిల ఆర్య వైశ్య మహాసభవారు కన్యకాపరమేశ్వరీ చరిత్రను సంగ్రహముగఁ బ్రకటించి, దీని నాధార పఱచుకొని నాటకము రచించిన కవిని రు 116/లతో సత్కరించెద మని ప్రకటించిరి. "ప్రాంశు లభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః" అని కవికుల గురువు కాళిదా సన్నట్లు నే నా పనికి అసమర్థుఁడ నని నాకుఁ దెలియును. కాని మహాసభా కార్యదర్శిగారగు శ్రీ రావు బహద్దర్ తుంపూడి భగవంతం గుప్త గారు న న్నీ కార్య క్రమమున కుపక్రమింప వలసినదిగాఁ బ్రోత్సహించిరి. నేనును వారి కరావలంబనమున నీ పనికిఁ బూనుకొంటిని. ఈ కావ్యము నందలి కథా నిర్మాణముఁ గావించి, అంక రంగ విభజనఁ గావించినవారు శ్రీ భగవంతంగుప్తగారే. ఈ నాటక రచనలో శ్రీ వారు చూపిన అపరాభిమానములు నిరుపమానములు. అంతియే గాక, యీ చిన్న నాటకమునకు విమర్శక

శిరోమణులగు శ్రీ భగవంతం గుప్తగారు అమోఘ పీఠికను వ్రాసి యిచ్చినారు. వారి ప్రతిభా విశేషములను గూర్చిగాని, వారి విమర్శనా శక్తిని గూర్చి గాని నేను పాఠకులకు తెలుపుట దిననాథుని కరదీపికతోఁ జూపుట వంటి దగును.

ఈ నాటకమున హృదయంగమములగు కొన్ని కొన్ని సవరణలను గావించి యిచ్చిన శ్రీ శిఖరం కోటీశ్వర గుప్తగారికి నే నెంతయుఁ గృతజ్ఞుడను.

గ్రంథములోని చరిత్రాంశముల ననుసరించియే "వాసవీ విజయము" అని దీనికి నామకరణ మొనర్చితిని. ఈ కథకు మాతృకలు మూడు కనుపించు చున్నవి. (1) స్కాంద పురాణాంతర్గత సనత్సుజాతసంహిత లోని కన్యకా పురాణము (2) వాసవీ పురాణము (3) భాస్కర పురాణము. వానిలోఁ గన్యకా పురాణమును బరమ ప్రమాణముగా వైశ్యలోక మీ నాటికిని దలఁ దాల్చుచున్నది. పురాణ రచయిత లెవరు, చరిత్రకును బురాణమునకును గల సంబంధ బాంధవ్యము లెట్టివి, - మున్నగు విషయము లన్నియుఁ బీఠికలోఁ దల స్పర్శముగ విమర్శింపఁబడి యున్నవి. తొలుదొల్త నేను పురాణమును బఠింపఁగా నం దొక్కటియు నాకు యథార్థ మని తోచలేదు. చరిత్రకు దూరముగు టయే యందులకుఁ బ్రధాన కారణము. తరువాత శ్రీ భగవంతం గుప్తగారి యమూల్య సలహాలవలనఁ జాలా వఱకు సందియములఁ బాపుకొంటిని.

పురాణకర్తకుఁ బాండిత్య ప్రకర్ష యుండవచ్చును గాని, చారిత్రక దృష్టి కుందగించినట్లున్నది. ఈశ్వరుఁడు వైశ్యబృందమును బిలిచి, భూలోకమున విశ్వకర్మ నిర్మితమగు బృహద్గిర్యాది మహా నగరంబుల కరుగుఁ డని శాపం బిచ్చెను. ఆ బృహద్గిరియే ప్రస్తుతము "పెనుగొండ"గా వ్యవహరింపఁబడు చున్నది. అది చిన్నగ్రామము. ప్రపంచమున నెన్నియో ఖండములు, దేశములు, పెద్ద పెద్ద నగరములు విరాజిల్లుచుండ, పెనుగొండ గ్రామ మెచ్చట నున్న దని ఆ శాపగ్రస్తులేల యన్వేషించుచు రావలెనో పురాణ కర్తయే చెప్పవలెను.

పురాణము నామూలాగ్రముఁ బఠించినచో మన కేల కన్యకాపరమేశ్వరిని బూజింపవలె నను జిజ్ఞాస సహృదయునకుఁ గలుగక మానదు. వైశ్యలోకమున కామె చేసిన యుపకార మేమి? తన యంతటి సుందరవనితలు వైశ్యాన్వయమునఁ బుట్టరా దని శాపం బిడినదట! కొన్నికొన్ని పూచాగముల నిద

మిత్థమని నిర్ణయించినదట! అగ్నిప్రవేశ మొనర్చినదట! ఈవిషయమును మాత్రము చెప్పిన వైశ్యులు వాకవిని బూజితప రని సందియమునఁ బురాణకారుఁ డామెను బార్వతిని జేసి విశ్వరూప ఘట్టమును సృష్టించినాఁడు.

ప్రకృత మాంధ్రదేశములో నున్న కన్యకాపరమేశ్వరీ దేవాలయము లన్నింటిలోను మూలవిరాట్టునకు మంగళసూత్ర ముండును. కన్యకగా నున్నపుడే యగ్నిప్రవేశ మొనర్చిన కన్యకాపరమేశ్వరీ గళమునఁ దాళి యుండుటకు గారణ మేమియో గుహ్యముగ నున్నది. మన సంఘస్థితిగతులను సింహావలోకన మొనర్చి యొక్కమారు పరికించినచో, స్వార్థపరులగు శాస్త్రకారులం మనపట్ల కొంత ద్రోహబుద్ధిఁ జూపి రని చెప్పక తప్పదు. నేనీ నాటకరచనకు బూనుకున్నప్పుడిట్టి సంఘటన లెన్నియో నామ్రోల సాక్షాత్కరించినవి. వీని కన్నిటికిని ప్రత్యుత్తరము లిప్పుడు లభించినది.

నానాటికి మన సంఘము విద్యావంతమైనగాని యీ యనర్థములు తొలఁగఁ జాలవు.

ఈ నాటక సంవిధానమున నా కత్యంతము సహాయభూతులైన శ్రీ భగవంతం గుప్తగారికిని, వలయుసవరణలు చేసిన శ్రీ కోటీశ్వర గుప్తగారికిని, శ్రీ దోమా వేంకటస్వామి గుప్త గారికిని మఱల కృతజ్ఞతాపూర్వక నమోవాచకముల నర్పించుచున్నాను. ఈ రూపకమును సాంతముగ బఠించి సదభిప్రాయముల నొసంగిన సంఖ్యావంతుల కెల్లరకును నా నమస్సులు.

ఈ నాటకము రసవంతమా, నీరసమా, — యను విషయమున రసజ్ఞులగు పఠితలే ప్రేక్షకులే ప్రమాణము.:—

“హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపి వా” అని కదా కాళిదాస భణితి. ఏ కవిగాని గుండెపై చేతి నిడుకొని నా గ్రంథము దోషరహిత మని చెప్పఁజాలఁడు. అట్టినెడ నల్పజ్ఞుఁడ నగు నా విషయమునఁ దప్పులు పెక్కు లుండ వచ్చును. గుణగ్రహణ పారీణులగు వారు గ్రంథమునఁగల దోషముల నాకుఁ దెలిపినచో ద్వితీయ ముద్రణమున సవరించుకొనగలవాఁడను.

ఇట్లు

గట్టె సత్యనారాయణ గుప్త.

# అభిప్రాయములు.

౧

శ్రీ గర్జె సత్యనారాయణ గుప్త రచించిన వాసవీ విజయమును సాంతముగాఁ జదివితిని. కథా కథనము ఆకర్షణీయముగా నున్నది. వాసవీ కన్యక చిన్ననాఁటే తన తోడిచెలికత్తెలకు ప్రకృతి దృశ్యములను జూపుచు బోధపఱచిన నీతులు హృదయంగమములుగా నున్నవి. ఆ అల్పవయస్సులోనే అవలంబించిన వైరాగ్యమార్గము ఈ జీవితము తుచ్ఛమని గోచరింపజేయఁ గలదు. విరూపాక్షుడు యోధానుయోధునివలె గుఱ్ఱపు స్వారి చేసినదే గాక శస్త్రాస్త్ర ప్రయోగకార్యములలో నిపుణుడై చక్రవర్తిని గూడ యోడింప గలిగినవీరుడై వెలసినాడు. చక్రవర్తి విజయయాత్ర చేసికొని పెనుగొండకు ఏగినప్పుడు కులము పెద్దలు విదేశ వస్తువులను నీడుగా సమర్పింపఁ బూనుకొన్నతఱి, బాల నగరులు స్వదేశవస్తువులను గానుకలుగా నీయ సమకట్టి దేశాభిమానమును బ్రకటించిరి. ఇంతియు కాక, అందలి నాయకులు వివిధ పరిశ్రమలను పోషించుచుండుట గమనించినచో ఇప్పటి మనవారికి పరిశ్రమాభివృద్ధిపట్ల హెచ్చుపట్టుదల పట్టువడ వచ్చును. మొత్తముమీద కథయొక్క పోకడ చాల ఆనందదాయకముగా నున్నదని చెప్పగలను. కవి చిన్నవాడై ఆతని రచన ఘన భావోపేతమై శైలి సులభగ్రాహ్యమైయున్న కారణమున అన్ని విధాలఁ బ్రోత్సహింపఁ దగియున్నది.

శిఖరం కోటీశ్వర గుప్త.

౨

శ్రీ గర్రె సత్యనారాయణ గుప్తగారి రచనగా నిర్మింపబడిన శ్రీవాసవీ విజయ రూపకమును గాంచితిని. శ్రీ సత్యనారాయణ గుప్తగారు ఈపాత్రమును శ్రీ భగవంతము గుప్తగారి సంపూర్ణ సాహాయ్యమువల్ల వ్రాయ గలిగినట్లు ఈ పాత్రమె వేనోళ్ళ చాటుచున్నది. ఈ గ్రంథము ఇట్లు ప్రకటింపబడుటకు శ్రీ భగవంతము గుప్తగారు గావించిన కృషి యెంతయు సంస్తవనీయము. ఇందలి యోగ్యత కంతకును శ్రీ భగవంతం గుప్తగారే కారణ మని నా దృఢవిశ్వాసము.

శ్రీ భగవంతం గుప్తగారు గావించిన సంస్కారమునకు తోడుగా నేనును వారును రెండు మూడు రోజులు శ్రమించి ఈ కృతియందు వలయు నని తోచిన మార్పులను వీలైనంతవరకు గావించినాము.

దోమా వెంకట స్వామి గుప్త,

బెజవాడ, 7-2-45.

# ముఖ్యపాత్రలు.

వాసవి — కుసుమాంబా కుసుమశ్రేష్ఠుల పుత్రిక.

శాంత, కమల — వాసవి చెలికత్తెలు.

కుసుమాంబ — వాసవి తల్లి.

కాత్యాయని — పెనుగొండ స్త్రీల ప్రతినిధి.

గణాచారి — పరమేశ్వరీ పూజారి.

కుందవ — విష్ణువర్ధనుని పట్టపుదేవి.

కుసుమశ్రేష్ఠి — పెనుగొండ నగరాధిపుడు.

భీమశ్రేష్ఠి, తిమ్మప్పసెట్టి, ధనదుడు — పెనుగొండ నగర స్వాములు

సాంబమూర్తి — కుసుమశ్రేష్ఠికి కార్యనిర్వాహకుడు.

తిప్పయ్యసెట్టి — కుసుమశ్రేష్ఠికి ప్రతిపక్ష నగరస్వామి.

వెంకప్పసెట్టి, సదాశివసెట్టి — తిప్పయ్యసెట్టికి అనుచరులు.

విరూపాక్షుడు — వాసవికి అన్న.

ప్రభాకరుడు, అనంతుడు, మురహరి, ధనగుడు — పెనుగొండ బాలనగరులు.

విష్ణువర్ధనుడు — చాళుక్య సామ్రాజ్యాధిపతి.

విజయశీలుడు — విష్ణువర్ధనుని ప్రధానమంత్రి.

మరి యిద్దరు మంత్రులు.

విదూషకుడు — విష్ణువర్ధనునివద్ద పండితుడు.

కొత్వాలు — విష్ణువర్ధనుని సర్వసేనాధిపతి.

కోదండుడు — కొత్వాలుక్రింది నాయకుడు.

రాజభట్టు — విష్ణువర్ధనుని రథసారథి.

భటుడు — విష్ణువర్ధనుని సేవకుడు.

రాజరాజనరేంద్రుడు — విష్ణువర్ధనుని కుమారుడు.

# వాసవీ విజయము

## నాంది.

మ. సకలాశాతతి రోదసీ కుహరమున్ - శక్తి న్నిరూపించి, సా
త్త్విక రాజత్వ తమో గుణంబులకు సం - దీప్తిన్ బ్రసాదించి, వి
శ్వకళారాధన నైపుణిన్ వెలిఁగి, స - ర్వశ్రేయము ల్గూర్చు, క
న్యక, లోకేశ్వరి, విశ్వమాత శుభమ - త్యంతమ్ముఁ గల్గించుతన్ .

సూత్రధారుఁడు:— (ప్రవేశించి) నటీ! నటీ!

నటి :— నాథా! వచ్చుచున్నాను. ఏమి సెలవు?

సూ :— అటు చూడుము. రంగస్థలము నవలోకింపుము.

నటి:— (అవలోకించి) ఆహా! మన భాగ్యమే భాగ్యము. ఇన్నాళ్లనుండి యెన్ని నాటకములో యాఁడితిమి గాని, యింత ఉత్సాహవంతులు ఎన్నఁడును రాలేదు. ఎట్లు రక్తిఁగట్టింతుమో యని మాత్రము సందేహము.

సూ:— పిచ్చిదానా! వినుము. ఈ నాటకమునందలి నాయిక కన్యక. ఆయమ యవివాహిత. నటకులా, నిపుణులు. వచ్చిన ప్రేక్షకులా, ఉత్సాహవంతులు, రసజ్ఞులు. ఈ నాటకము రచించిన కవి యెవరో తెలియునా?

చ. తినుటకుఁ దిండి లేక, కడు - త్రిప్పల నందుచు, నుల్కుమంచ మం
దున నె యనేక కావ్యములఁ - దుష్టి రచించు కవీశ్వరుండు, కా
రణమెది లేకయే యువక - రక్తము డెందమునం జలింపఁగాఁ,
దన కలమున్ బ్రయోగమునఁ - దన్పిన నేర్పరి. స్త్రీయసంఘమే
గనక యుపేక్షఁ జేసె; కవి - గారిని నే నిఁకఁ జెప్పబో నిటన్.

ఇఁక రక్తిఁ గట్టుటకు సందేహ ముందునా?

నటి :—నాథా! అది సరియేగాని, యీ వసంతాగమమును బరికింపుడు, ఇందులో నెన్ని విచిత్రములు గనుపించుచున్నవో!

సూ :—అవును నటీ. ఆ దృశ్యమును బరికింపుము.

మ. అదె చాంపేయ సుమంబు, దానికొఱకై - యా భృంగరాజంబు తా
నెద యోచింపక, మోహబద్ధమయి, యా-యీ వైపులన్ జూచుచున్,
గదియంబోయి స్వసంఘ సైన్యములతోఁ - గాలాంతమున్ గాంచదే?
ఎది యన్యాయమొ, న్యాయమో, తెలియలే - నే లేదు కాలంబిలన్.

నటి :—ఈ దృశ్యము స్త్రీలోలుఁడగు రాజు, ఒక సుందరవనితను బలాత్కరించి, నాశనమొందిన రీతిని విరాజిల్లుచున్నయది.

సూ:—మంచి యుపమానమును జెప్పినావునటీ! ఒకవేళ సూచనయేమో యిది!

నటి :—బాగున్నది. మీరు మాటలతోనే ప్రొద్దు పుచ్చిన నాటక మెప్పుడాడెదరు!

సూ :—అవును. పోదమురా.

(ఇరువురును నిష్క్రమింతురు)

# ప్రథమాంకము.

## ప్రథమరంగము.

## పెనుగొండనగరము - సభామంటపము.

(కుసుమ శ్రేష్ఠి అధ్యక్ష స్థానమున నుండును. తదితర నూటరెండు గోత్రాధిపులు నుచితాసనముల సభ్యులుగా నుందురు.)

## ప్రార్థన.

గేయము:—జగన్నిర్మాణకారిణీ !-జగన్మాతా ! నమో, నమో,
ఓంకారరూపిణీ ! - హృదయోల్లాసినీ ! నమో, నమో, ॥జగ॥
లోకమాతా! లోకపూతా ! - లోకాతీతా! నమో, నమో, ॥జగ॥
పాహి ! పాహి ! మాం - పరమ పావనీ ! నమో, నమో, ॥జగ॥

కుసుమ:—(లేచి) సభ్యులారా! మన మెల్లర మా పరమేశ్వరీ కృపాకటాక్షముచే నింతవఱకును సుఖముగా నున్నవారము.

సీ. కార్మిక కృషిక సం - ఘమ్ముల రక్షించి
కడలిపై యోడలఁ - గలయఁ ద్రిప్పి,
క్షామంబు వారించి - సౌఖ్యంబు పెంపొంద
దిక్కుదిక్కులఁ జేర - దినుసు లంపి,
వివిధంబులౌ వృత్తి - విద్యల బోధించి
పరిశోధనల పట్ల - పటిమఁ గరపి,
వ్యాయామ శోభలు - వ్యాప్తి నొందఁగఁ జేసి,
యజ్ఞాన తిమిరంబు - లణఁగఁద్రొక్కి,
ధైర్యంబుఁ జేకూర్చి - ధర్మంబు స్థాపించి
విమలాంతరంగంబు - వెలయఁ జూచి,
కళలను బోషించి - కలుషంబు హరియించి
సుఖములు వికసిల్ల - ముదము నొదవి,

గీ. యంగ హీనుల వృద్ధుల - నార్తజనుల,
నిండు మనమునఁ గాపాడి - నీతి నెఱపి,
సమహితత్వంబు సత్యంబు - సతము గొలిపి,
ప్రణయ సూత్రాన బంధించి - ప్రజల నెల్ల,
సిరియు సంపద లొదవంగఁ - జేయు దీప్తి,
యంబ లోకమాత యనుగ్ర - హంబు గాదె.

వణిక్సత్తములారా! అనురాగప్రేరితమైన యైకమత్యమే శ్రేయోదాయకము. ప్రజానీక మామోదింపని ప్రతికార్యమును అనర్థము నే గలిగించును. మన మప్పుడప్పుడు సమావేశమై, ప్రకృత పరిస్థితులను జర్చించుకొనుచుండినచో, మన జాతి మిక్కిలి యౌన్నత్యమును బొందఁ గలుగును. ఒండొరుల ప్రేమమే జీవితమున కానందమును గలుగఁజేయును. విశ్వమానవ ప్రేమ హృదయమున వెలసిననాఁడే మన కర్తవ్యముల నెఱింగినవార మగుదుము. భీమశ్రేష్ఠిగారూ! పరిశ్రమల విషయములో మునుపటికంటె నిప్పు డెక్కువ యభివృద్ధి గనుపించుటలేదా?

భీమ:—కనుపింపకేమి? ప్రకృతము ప్రతివృత్తియందును నిపుణుల నేకు లున్నారు.

సీ. వేలకు వేలుగా - విలసిల్లు మనలోన
రకముగ నిపుణ నా - యక గణంబు,
వందలాదిగను జీ - వనముఁ జేయుచునుండ
నిత్యంబుఁ జేయుఁ జే - నేతవలన,
ఇది తాయి యెట్లు కా - దే! యనునటుల
శిలలఁ జెక్కుచునుండ - శిల్పగణము
గంటంబు లాకులు - మంటపంబులు సౌధ
నిర్మాణకౌశలుల్ - నెగడు చుండ,

గీ. మన పరిశ్రమశాలలు - మనదు వర్త
కములు బహుళమై సాఁగలో - కంబునందు,
యశము గడియింపఁ గల్గితి - మంతకన్న
వృద్ధిఁ జేయుట కర్తవ్య - మింక మనకు.

ఈ కర్షకులకుఁ గార్మికులకుఁ గళావేత్తలకుఁ దగినంత సాహాయ్య ప్రోత్సాహము లున్నను, మనము ముందంజ వేసి, ధన సాహాయ్యాదికములను బహుళముగా నొసంగి, పరిశ్రమాదులను నూతనపథమునందు నడిపించుట కర్తవ్యము.

కుసుమ:—అవును. పరిశ్రమాదికము లభివృద్ధిలో నున్ననాఁడే, ప్రజానీకము సౌఖ్యముగా జీవింపఁ గలదు. ప్రకృతము మన చాళుక్య సామ్రాజ్యాధిపతి యగు విష్ణువర్ధన మహారాజు గూడ ధీమంతుఁ డనియు, దిగ్విజయముఁ జేయ సామర్థ్యము గలవాఁడనియు, శౌర్యవంతుఁ డనియు, రాజ్యనిర్వాహణమునందు నైపుణ్యము గలవాఁ డనియు, ప్రజాసౌఖ్యమును గోరువాఁ డనియు వినుచున్నాము. కాని యీ మధ్య స్త్రీధనాపేక్షలలో నిమగ్నుఁడై యున్నవాఁ డని గూడ వినికిడి. తిమ్మప్ప సెట్టిగారూ! ఈ విషయమును మీరు వినియున్నారా?

తిమ్మప్ప:—ఇంతయే గాదు. ఆయన ఈ పౌరాణిక ప్రచారక బృందమునకు బద్ధుఁడయి, పురాణమతమును విజృంభింపఁజేయుచున్నాఁడు. అన్యమతముల వారిని తృణీకరించుచున్నాఁడు. స్వీయకుల సంప్రదాయములను అన్య జాతులకు వర్తింపఁజేయ నుంకించుచున్నాఁడు.

కుసుమ:—వారి మతము నౌన్నత్యమునకుఁ దీసికొనివచ్చుట న్యాయమే గాని, యన్యమతములను నిర్బంధింపఁ జూచుట యంత సమీచీనముగా నుండ

లేదు. ఏ రాజునకైన నెవ్వియో లోపము లుండక పోవు. మన మీ సామ్రాజ్యములో నివారము, ఈ చిన్న విషయముల నెక్కువగఁ దర్కింపక సద్గుణముల నే తలఁచుచు, రాజభక్తిని గలిగియుండుట ధర్మము. పరమేశ్వరీ కృపాకటాక్షమున మనకుఁ గీడు వాటిల్ల నేరదు.

తిమ్మప్ప :—(లేచి) నిరవద్యము, ఏలాపురము, వీరనారాయణము, విశాలము, శివపురము, ఆసంటము, వరసము, ధనదము, ధర్మపురము, జగన్నాధము, కళింగము, పాంచాలము, పాలకుండము, త్రిగుణము, భీమము, ఘంటసాలము, పీఠికాపురము,—అను నీ పట్టణవణిజులు దేవీపూజల యందును ఆచారవ్యవహారములందును, వాణిజ్యమందును, మఱి యన్ని విషయము లందును మనతోఁ గలిసి వర్తించుచు నొక సంఘముగా నేర్పడియున్నను, అందులోఁ గొందఱికి మనమీద కొంత కొంత యీసు జనించి యున్నదని మనము గ్రహింపవలసియున్నది.

కుసుమ :—మన ప్రవర్తనయందుఁ గల్మషము లేకుండిన(జాలును. నిజ మెప్పుడును నిలకడమీఁదఁ దెలియుచుండును. అభిప్రాయభేదము లుండుట సహజము. సభ్యులారా! నేడు తర్కింపవలసిన విషయము మఱి యేదియును లేదు ఏ శాఖకు సంబంధించిన పరిశ్రమలను, పశుశాలలను, పంటపొలములను ఆ శాఖవారు పరిశీలించుటకుఁ బోవలసియున్నది. ఈ విషయముల మన మప్రమత్తులమై యుండవలయును.

(అందఱు నిష్క్రమింతురు.)

## ద్వితీయ రంగము.

### పరమేశ్వరీ దేవాలయము ప్రక్కన పూలతోట.

(వాసవి చెలికత్తెలతోఁ బ్రవేశించును.)

శాంత :—(చెట్టుపైనున్న కోయిలను జూపించి) చెలీ! వాసవీ! వీణాగానమునకంటె నెంతయు మధురముగా నున్నదే, యీ కోయిల కంఠస్వరము. గానకళ దీని కేమి తెలియును?

వాసవి:—(చిరునవ్వు నవ్వి) కంఠమునకు శాస్త్రమునకుఁ సంబంధమేమి? చెలీ! ఛందశ్శాస్త్రమును నేర్చినవారల ల్లెరును గవిత వల్లఁగలరా? మన

గురువుగారైనను శాస్త్రమును నేర్పుదురే గాని, మధుర కంఠమును ప్రసాదింపరు కద ? నీ విన్నాళ్లనుండి సంగీతము నభ్యసించుచున్నావు. నే నొక బిచ్చగత్తెను జూపింతును. దానివలె నీవు పాడఁగలవా ? శాస్త్ర చర్చకు వచ్చినప్పు డది యోడిపోవచ్చును.

కమల:—సఖీ ! వాసవీ ! నేను సత్యముగా నా హృదయాభిప్రాయములఁ దెలియఁ జెప్పెదను, వినుము. సమ్ముఖమునఁ జెప్పిన కేవలము భూషించుచున్నా ననుకొందు వనియే యెప్పుడును నుడివి యుండలేదు. నిజముగా నీ స్నేహమువలననే మా జీవితములు ధన్యములైనవి: మేము విద్య నభ్యసింపఁ గలిగితిమి : లోకజ్ఞాన మబ్బుచున్నది.

వాసవి :—సఖీ ! ఇదియే యథార్థమైనచో, నాకు మిక్కిలి సంతోషము. మన జీవితము లశాశ్వతములైనవి. ఇట్టి యశాశ్వతజీవితమున శాశ్వతకార్యముల నిర్వహించిననాఁడే, మన జీవితములు ధన్యము లగును. స్త్రీ గాని పురుషుఁడుగాని తన శక్తి సామర్థ్యములు లోకోద్ధరణకుఁ బ్రసాదింపఁబడినవిగాఁ దలఁచి, యట్లు వానిని వినియోగించుట ధర్మము.

శాంత :—దేని నైనను సాధింపవచ్చునుగాని, ఆశాపాశమును ద్రెంపుట కష్టసాధ్యము గదా ?

వాసవి :—నీవు మిక్కిలి పొరఁబడుచున్నావు, చెలీ ! మానవయత్నమున కసాధ్య మనునది లేదు, ప్రయత్నలోపమే గాని వేరు గాదు.

కమల :—అది నిజమే సఖీ ! మనము గూడ విశ్వమానవ ప్రేమతో సాధ్యమైనంతవఱకు మానవసేవను జేయుచుందము. ఈ చాళుక్య సామ్రాజ్యమునఁ దిండి లేక యన్నమో రామచంద్రా యని యల్లాడువా రనేకు లున్నారు. క్షామపీడితులు, వికలాంగులు, తినుటకుఁ దిండి కట్టుటకు గుడ్డ లేనివారు మన పట్టణమునకే వచ్చుచున్నారు.

శాంత :—అవును చెలీ ! వందలా, వేలా, లెక్కకు మితిమీరి వచ్చుచున్నారు. ఎందఱిని యీ పట్టణమా గాపాడఁ గలదో? మనము శిశు సంరక్షణమునకుఁ బాలు పంచుచున్నా మని విని, ప్రొద్దు పొడుచుసరికి నెక్కడెక్కడ నుండియో తల్లులు బిడ్డల నెత్తుకొని వచ్చుచున్నారు.

వాసవి :—చెలీ ! ఆ పుణ్యము మనకే దక్కనిమ్ము ! మన సర్వస్వము గూడ దీనికే వినియోగింతము. రేపటినుండియు నన్నదానమునకు, క్షీరదానమునకు

మనము విశేషముగా విచారింతము. ఎక్కువకాల మిక్కడనే గడుపుచు వచ్చినయెడల పూజకు వేళ యగునేమో! పుష్పాపచయముఁ జేయుదమా?

కమల:—అవును సఖీ! రమ్ము.

(అందఱును గలసి గేయమును బాడుచు, పూవులఁ గోయుదురు.)

గే యా ము.

చేమంతి బంతి పూలూ, మన - వంత లన్నియుఁ దీర్చు పూలూ!
హా యనిపించు పూలూ, హృద - యంబుఁ గరగించు పూలూ,... చే॥
మనోరంజన సుమాలూ, అందము - త్యంతమ్ముఁ జూపు కుసుమాలూ॥ చే॥
పన్నీరు జాతి కుసుమాలూ, - సన్నజాజీల వన్నె గుచ్ఛాలూ॥ చే॥

శాంత:—ఈ రోజున నీ పూలతోట యెందువల్లనో మిక్కిలి మనోహరముగ నున్నది చెలీ! ఈ మనోరంజన పుష్పములు పన్నీరు పూలు బాగుగా వికసించి, పరిమళమును వెదజల్లుచున్నవి. ఈ వనము నిజముగాఁ బ్రణయమును బురికొల్పుచున్నదిగదా! వాసవీ! ఈ లీలావిశ్వ మంతయుఁ బ్రేమమయమే.

వాసవి:—అవును సఖీ! కాని సత్యమగు ప్రేమను గమనింపలేకున్నదీ ప్రపంచము.

కమల:—సత్యమగు ప్రేమ యనఁగా నేమి?

వాసవి:—(దరహాసముతో) ఆనందమయ మగు ప్రేమ.

శాంత:—అంతియేనా? నే నేమో గదా యనుకొంటిని.

కమల:—అది గాదు వాసవీ! మన శాంత పరిణయ మాడెనేగాని, ప్రణయానందము నింకను ననుభవింప లేదు. ఇంతలో నే యదియును నేర్పడును.

శాంత:—(సిగ్గుతో) నీవు మాత్రము బ్రహ్మచర్యమును వహింతువా!

వాసవి:—కమలా! దాని నెందులకు నూరక హేళనఁ జేసెదవు?

కమల:—వాసవీ! ఇటు రమ్ము! ఆ మాధవీలత ఆ చెట్టుకొమ్మలకుఁ జుట్టుకొని యెంత ఆనందమును గొలుపుచున్నదో చూడుము. ఈ వైపునకు రమ్ము చెలీ! చక్రవాకి తామర తూడులను ముక్కలుగాఁ జేసి యరటి దొప్పలోని మధురసమున ముంచి చక్రవాకము నోటఁ బెట్టుచున్నది. ఆ చక్రవాకపక్షి యెంత సంతోషము ననుభవించుచున్నదో గదా! సఖీ!

యీ ప్రక్కకు రమ్ము. ఆ కోయిల జంటను బరికింపుము. ఇటు చూడుము, చెలీ! ఇదిగో! రెండు దిక్కులనుండి వచ్చుచున్న యా కాలువలు ఒకే లోయగా మారి, యెట్లు ప్రవహించుచున్నదో చూడుము. ఆహా! యేమి యీ ప్రకృతి సౌందర్యము!

గీ. బండి గురివెంద లత వోలెఁ-బరిఢవిల్లి
సుందరావనంబందుఁ గ-స్తూరి నుంచి
ప్రణయకుసుమముల్ ధరియించి-ప్రకృతి కాంత
యెంత హృదయంగమంబుగ - నెసఁగుచుండె!

వాసవీ! యీ ప్రకృతిదృశ్యమును బరికించినచో, మన జీవితమును గూడ యెప్పు డెప్పుడు ప్రణయాంకితముఁ జేయుదమా యను కోరిక జనించుట లేదా? ఈ శిరీషకోమల మా యౌవనమును ఆనందమయముగాఁ జేయవలదా? సఖీ! వాసవీ! మన జీవితములందుఁ బ్రణయసౌఖ్యము లెప్పుడు గలుగునో!

వాసవి:—ఎంతటి పిచ్చిదానవు కమలా! ఇంతకు ముందు మన మేమి యను కొంటిమి? ఆశాపాశమును ద్రెంపవలెనని గదా? మనస్సు మిక్కిలి చపలమైనది సఖీ! నేల మీద నీరు పల్లమునకే పోవునట్లు, మనస్సు ముందు విషయవాంఛలకే లోనగునుండును. ఈ ప్రకృతిదృశ్యమున యథార్థ తత్త్వమును నీవు గమనింపనే లేదు. ఆ వికసించిన శిరీష కుసుమము యొక్క వికాసమును పరిమళము నెంత తడ వుండును చెలీ! ఒక గడియ, లేక యొకరోజు. అంతియే గదా? మన సౌందర్యము యౌవనము గూడ అంతియే. అందులో శాశ్వతానంద మున్నదా? కేవల మాధ్యాత్మిక దృష్టి గలవారికి ఈ ప్రకృతియే విద్యను గఱపుచున్నది.

కమల:—నీ మాటలు మఱియు విచిత్రములుగ నున్నవి, చెలీ! ఈ చెట్లు చేమలు చదువును గూడ నేర్పుచున్నవా?

వాసవి:—కమలా! శాంత! ఇటు రండు, ఒక్కపరి నిర్మల దృష్టితో నీ ప్రకృతి చిత్రములను బరికింపుడు!

సీ॥ మాటిమాటికి గిట్టు - నీటి బుగ్గలు మన
దేహాస్థిరత్వంబుఁ - దెలుప వొక్కొ!
తామర పాకునఁ - దగలు కణంబులు
చిత్తచాపల్యంబుఁ - జెప్పవొక్కొ!

నలుకొనక వడివోవు - తరు లతాపుంజముల్
ఓర్పను పాఠంబు - నేర్పవొక్కొ !
పెనుగాలి వీచిన - భీతిఁజెందని పెద్ద
కొండలు ధైర్యంబుఁ - గూర్పవొక్కొ !
గీ॥ ప్రకృతిపాఠంబుఁ జదువంగ - వలయుఁగాని
ఎల్ల విషయంబులందె వర్తిల్లుచుండు
ప్రకృతి దృశ్యంబునకు భగ-వంతునకును
భేద మెక్కుడింతయైనను - లేదుగాదె !

చెలీ! శాశ్వతానందము ననుభవింపఁ జాలినప్పు డీ విషయ సౌఖ్యము లన్నియుఁ దృణప్రాయములు గదా! మన ప్రేమను సర్వస్వమును, సృష్టి స్థితి లయ కారిణియగు నా భగవతీపాదారవిందముల కర్పించినప్పుడే మనకు శాశ్వతానందము గలుగును. శాశ్వతానందము నందుటకు మానవులకు రెండు మార్గములు గలవు. అం దుత్తమపథము నైష్ఠికము; మధ్యమము, ఉపకుర్వాణము. నైష్ఠిక మనఁగా, స్త్రీగాని పురుషుఁడుగాని ఆజన్మాంతము, బ్రహ్మచర్య దీక్షను వహించి, కేవల మాధ్యాత్మిక జీవనముఁ గడపుచు, జీవిత మంతయుఁ ద్యాగముఁజేసి కైవల్యము నందుట. ఇది కొంచెము కష్టసాధ్యము. ఉపకుర్వాణము సర్వసాధారణమార్గము. పదునాఱు వత్సరముల వఱకు బ్రహ్మచర్యమునఁ గడపి, పిమ్మట క్రమముగా గృహస్థాశ్రమము వానప్రస్థాశ్రమము సన్యాసాశ్రమము స్వీకరించుట. చెలీ! నీవు గూడ మానవధర్మముల నెఱింగి, శాశ్వతానందము నందుటకై యత్నింపుము.

కమల:—సఖీ! వాసవీ! ఇంత చిన్నవయస్సులో నీ కెట్లు జనించిన దీ వైరాగ్యము? నిక్కముగా నీ భాషణములు మాకు జ్ఞానజ్యోతిని బ్రసాదించినవి. ముందు మన మెల్లర మా పరమేశ్వరీ పూజనైనను సక్రమముగా నొనర్చి, యామె దయకుఁ బాత్రుల మయ్యెదము గాక.

వాసవి:—అవును. పూజవేళయయినది. రండు పోవుదము!

(నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

## గోదావరి నదీతీరము.

(ప్రభాకరుఁడు, అనంతుఁడు ప్రవేశింతురు.)

ప్రభా:—అనంతా! ఈ రోజు గుఱ్ఱపు స్వారీలో నెవరు గెలుపొందిరి? ఆ విశేషములు సవిస్తరముగాఁ జెప్పుము.

అనంత :—నీవు రాలేదా?

ప్రభా :—మా తండ్రిగారు గ్రామాంతరమున నున్నారు. అందువల్ల రాజాల నైతిని.

అనం :—అట్లైనఁ జెప్పెదను వినుము. ప్రభాకరా! నిజముగా మన విరూపాక్షుఁ డంత శక్తివంతుఁ డని నే నెన్నఁడును ననుకొని యుండలేదు. ఆహాహా! అది యెక్కడి శక్తి! అది యేమి నిపుణత! ఇంత చిన్నవయసులో నెప్పుడు నేర్చు కొనినాఁడో! నాకు గ్రాహ్యము కాలేదు. ఆ గోదావరి బయళ్లలో, పారసీకాశ్వము నెక్కివచ్చుచుండగా, వాయువేగ మనవలెనో, మనోవేగ మనవలెనో, గోచరము గాలేదు. చూచిన ప్రతిమానవుఁడును ముక్కు మీద వ్రేలు వేసికొన్నాఁడు. గొప్ప యోధులు సైత మాశ్చర్య చకితులైరి.

ప్రభా :—బళీ! విరూపాక్షా! బళీ! వీరుఁడ వన్న నీవే! నీ యట్టివాఁ డొక్కఁడున్న చాలదా!

అనం :—అంతియే గాదు, అక్కడొక విచిత్రము గూడ జరిగినది. ఎవఁడో యొక కర్షకుఁడు తన భార్యాపుత్రులతో నెద్దుల బండిలో నావైపుగాఁ బోవుచుండఁగా, ఆ ప్రాంతమున నొక గుహాలోనుండి, గాండ్రిల్లుచు హఠాత్తుగా నొకవ్యాఘ్రము వచ్చినది. పాప మా కర్షకుఁడు గడగడ వణకి పోయినాఁడు. వెంటనే మన విరూపాక్షుఁడు మిక్కిలి తీవ్రతతో నమ్ముల పొదినుండి బాణమును దీసి, ప్రయోగించెను. పులి పొదలోనుండి వచ్చినదో రాలేదో, బాణము గురిఁదప్పక నూటిగా, దాని నోటిలో గ్రుచ్చుకొనినది. ఆ పులి గిరగిరఁ దన్నుకొని మరణించినది. ఆ కర్షకుని సంతోషము నే మని వర్ణింతును? అంతకు ముందొక సారి, గోదావరీ నదిలో గాలికి పడవ తిరుగఁబడగా, మన బాలనగరులు నీటిలో దుమికి, ప్రయాణికులను గట్టునకుఁ జేర్చినప్పుడును విరూపాక్షుఁడేగదా ప్రతిభావిశేషముచే విరాజిల్లినాఁడు. ఇతఁడే మనకుఁ దగిన నాయకుఁడు. ధైర్యసాహసములు త్యాగశీలమును నితనివలననే మన కలవడుచున్నవి.

ప్రభా :— ఏమి యీ కలకలము?

అనం:— (తెరవంకఁ జూచి) ఓహో! మనవారే! యిటువచ్చుచున్నారు.
(విరూపాక్షుఁడు, ధనదుఁడు, మురహరి, మణికొండలు ప్రవేశింతురు.)

విరూ :— అనంతా! యిక్కడ నున్నావేమి?

అనం :— మన ప్రభాకరునితో మాట్లాడుచున్నాను.

విరూ :— ప్రభాకరా! ఈ రోజు నీవు రాలే దేమి?

ప్రభా :— మా తండ్రిగారు గ్రామాంతరము వెళ్లుచు, నన్నింటివద్ద నుండ నియమించిరి.

అనం :— విరూపాక్షా! మీ రింతవఱ కెక్కడ నున్నారు?

విరూ :— మేము మధ్యలో నొక కార్మికశాలను చూచి వచ్చుచున్నాము.

ధనదు :— నిజముగా నా కార్మికులు ఎంతవస్తుచయమును నిర్మించుచున్నారు!

మురహరి :—వా రందఱు నా విధముగాఁ జెమట నూడ్చి, కష్టార్జితముచే జీవనముఁ జేయుచుండగా, వారిని సరకుసేయక, వారి కష్టసుఖములను విచారింపక, యాకాశసౌధములలో హంసతూలికా తల్పములందు హాయిగా నిద్రించు వా రనేకులు కన్పించుచున్నారు.

విరూ :—అది గాదు. ప్రపంచ ధర్మ మంతయు నింతియే. చీమలు పెట్టిన పుట్టలు పాములకు నెలవగుచుండును. కష్టపడి యార్జించువాఁ డొకఁడు, దాని ననుభవించువాఁడు మఱియొకఁడు. కష్టమునకుఁ దగిన ఫలిత మందఱికిని నందుట లేదు. అసమర్థులను వికలాంగులను బాటించు వారంతగా లేరు.

ధనదు :—ఇది కేవల మన్యాయము. తోడిమానవుఁడు గష్టపడుచుండ నెవఁడు గాని సుఖజీవనముఁ జేయుట పాడిగాదు. మానవుఁ డొక్కొక్కఁడును శక్తికొలఁది పాటుపడుచు, ఫలితము నందఱు సమముగఁ బంచుకొనరాదా?

విరూ :— అది పొసగుట కష్టము. సమానత్వ మనునది భగవత్సృష్టిలోనే లేదు. అయిదు వ్రేళ్లలోనే రెండును సమానముగ నుండవు. సర్వులు సుఖించవలెనను సిద్ధాంత మోక్షమార్గము కాదు. కాని తారతమ్యములు లేనిచో ఉత్సాహమునకును ద్యాగశీలతకును అవకాశ ముండదేమో! లోకాచరణమును గ్రహించుటకు మన కిదియే తరుణము. కార్యరంగమున దిగుటకుఁ గాలము ముం దున్నది.

మురహరి :— మన తల్లిదండ్రులు మనకు సుశిక్షణ నిచ్చుచున్నందుకుఁ గృతజ్ఞులము. ప్రస్తుతము వారి యాజ్ఞానువర్తులమై మెలగుటయే మన కర్తవ్యము. శ్రీరామచంద్రుఁడు తల్లిదండ్రుల యాజ్ఞ ననుసరించి యరణ్యమునకు

పోవుటకై వను వెనుదీయ లేదు. బాలబాలికలకుఁ దలిదండ్రులకంటెఁ బూజ నీయులు లేరు.

ధనదు:— విరూపాక్షా! ఈరోజు మిక్కిలి యాలస్యమైనది. తడవు చేసిన పాతశాలకు వేళ మీరిపోవును.

విరూ :— అవును. వెళ్లుదము రండు!

(అందఱు నిష్క్రమింతురు.)

## ద్వి తీ యాం క ము.

### ప్రథమరంగము.

### రాజమహేంద్రవరమున రాచనగరు.

(విష్ణువర్ధనుఁడు సింహాసనము నధిష్ఠించియుండును. ప్రధానమంత్రి విజయశీలుఁడు తదితరమంత్రులు సముచితాసనాసీనులై యుందురు.)

విష్ణు:—అమాత్యా! మన సామ్రాజ్యమింకను వృద్ధిఁబొందింపవలె నను కోరిక యున్నది. మన సామంత రాజు లెల్లరును గప్పములను సక్రమముగాఁ జెల్లించుచున్నారా?

విజయ :—ప్రభూ! మన చాళుక్య సామ్రాజ్య నిర్వహణమునం దే లోపములు లేవు. రాజ్యకార్యము లన్నియు సక్రమముగనే జరుగుచున్నవి. ప్రజానీక మంతయు సుఖజీవనమును జేయుచున్నది. కాని సామంతరాజులే కొందఱు సకాలమునకుఁ గప్పములను జెల్లించుట లేదు. రామచంద్రపురమున నర సింహరాజు క్రిందటిసాలు కప్పము గూడఁ జెల్లింపలేదు. ఈప్రాంతమున విశాలపురమునందు వేంకటపతిరాజు మహా గర్వముతోఁ బ్రవర్తించు చున్నట్లు తెలియుచున్నది.

విష్ణు :—మఱి...ఇన్నాళ్లనుండి నా కేల చెప్పలేదు?

విజయ :—తమతో మనవిఁ జేసికొనవలసినంతటిదిగాఁ బరిగణింప లేదు.

విష్ణు :—ఖర్చులు పోను సాంవత్సరికాదాయములో నెంత మిగులుచున్నది?

విజయ :—క్రిందటి వత్సరమునుండియు మిగులుట లేదు ప్రభూ!

విష్ణు :—ఎందువలన?

విజయ :—మన పైనిక శాఖకే యెక్కుడు వ్యయమగుచున్నది!

విష్ణు :—అట్టైన మతి కొన్ని పన్నులను ప్రవేశ పెట్టఁ గూడదా ?

విజయ :—ఇప్పటికే పన్ను లెక్కువగా నున్నవని ప్రజలు గగ్గోలు పడు చున్నట్లున్నది ప్రభూ !

సీ॥ వాణిజ్యశాఖఁలో - బ్రత్యంగమందున
  లెక్కువగాఁబన్ను - లెన్నో గలవు
అన్ని వృత్తులయందు - నధికమ్ముగా వసూ
  లగుచునుండెను బన్ను - లాను పూర్వ
రాజ్యమంతటి, గృహ - రాజంబులకు సౌధ
  సమితికి పన్ను ల - చ్చముగనుండ
పూరి కొంపలకును - భూము లన్నింటికి
  నగ్గలంబుగఁ బన్ను - లలరుచుండ

గీ॥ ఎగుమతి దిగుమతులకును - నెసఁగు సుంక
ము లిఁకనిట్టి వన్నింటినో - గలిగియుండ
వృద్ధి నొందింపఁ బూనిన - నేమి యగునో !
యోచనంజేయఁ గోరిక - యొండు గలదు.

విష్ణు :—ఎంత వెఱ్ఱివాఁడవు విజయశీలా ! రాజనీతికిని ధర్మశాస్త్రములకును వ్యత్యాసము గలదు. సామ్రాజ్యమును నిలువఁ బెట్టునది సైన్యజాలమే గదా? ఇందుకు ధన మావశ్యక మైనప్పుడు, పన్ను లధికముగఁ జేయక తప్పదు.

రెండవ మంత్రి :—మన మొకపరి విజయ యాత్రను సాగించినచో, పరిస్థితు లన్నియు ననుకూలపడు నని తోచుచున్నది. స్వామీ! సామంతరాజులలోనే ధనమదాంధు లనేకు లున్నారు. దిగ్విజయయాత్ర సాగించినచో ధనము లభించును; అందఱిని వశపఱచుకొనవచ్చును; క్రొత్తరాజ్యములు గూడ స్వాధీనముఁ జేసికొనవచ్చును.

విష్ణు :—అవును. ఈ యోచన బాగుగనే యున్నది. ఇందువలన మఱికొన్ని లాభములు గూడఁ గలసి వచ్చును. విజయశీలా! నాకు మఱియొండు కోరిక యున్నది. జీవితము నానందమయముఁ జేసికొనవలయునన్న మనసునకు నచ్చిన సౌందర్యవతి, సన్నిధి నుండవలయును. అంతఃపురకాంత లున్నారు గాని, వార్లు నా కుత్సాహముఁ గలిగింపఁజాలకున్నారు.

విజయ:— ప్రభూ! "రాజానో బహువల్లభాః"— అనిగదా నుడి. అంతః పురకాంత లెంద ఉన్న రాజ్యమునకంత శోభయే గాని న్యూనత లేదు. యాత్రను సాగించినచో సుందరస్త్రీ గ్రహణము గూడ లభింపఁగలదు.

మూడవమంత్రి:—అంతియే గాదు ప్రభూ! దిగ్విజయ యాత్రలో వర్ణాశ్రమ ప్రాధాన్యమును విస్తరింపఁ జేయవచ్చును.

విష్ణు:— అవును. అన్నింటికి ననుకూలముగనే యున్నది. శుభస్య శీఘ్రమ్మను చుందురు గదా! త్రేపే బయలుదేరుదము. విజయశీలా! నీవు పోయి, ప్రయాణసన్నాహముల సిద్ధపఱుపుము. ఈ నాటి కింకఁ గొల్వుఁ జాలించెదము.

(అందఱు నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము.

## కుసుమశ్రేష్ఠి గృహము.

(కుసుమశ్రేష్ఠి, సాంబమూర్తి, ఉచితాసనాసీనులై యుందురు.)

కుసుమ:— సాంబమూర్తీ! విష్ణువర్ధన మహారాజుగారు వేంచేసెదరు గదా! విడిది వసతులు మున్నగున వన్నియు నేర్పఱచుచున్నావా?

సాంబ:— విడిదిసౌధమును సిద్ధముఁ జేసినాను. శ్రీవారికి సమర్పించుటకుఁ గానుకలను గూడ సమకూర్చుచున్నాను.

కుసుమ:— ఏమేమి కానుకలను సిద్ధముఁ జేయుచున్నావు?

సాంబ:— మన కేమి లోపము! రాజు లందఱికంటె నధికముగనే సత్కరింప వలె నని తలంపు. కొన్ని గరుడపచ్చలు, మంచిముత్తెములు, సానఁబట్టిన వజ్రములు, రత్నములు, సువర్ణపాత్రలు, మొదలగునవి పరిశీలించుచున్నాను.

భటుడు:—(ప్రవేశించి) స్వామీ! బాలనగర ప్రతినిధి యఁట, మురహరిగారు వచ్చియున్నారు.

కుసు:— లోనికిఁ దోడ్కొనిరమ్ము!

మురహరి:— (ప్రవేశించి) నమస్కారము.

కుసు:— మురహరీ! రమ్ము! ఇటు కూర్చుండుము.

మురహరి:—(కూర్చుండి) తమతో నొక మనవిఁ జేసి పోవుటకై వచ్చినాను.

కుసు :— చెప్పుము.

మురహరి:—నిన్న మా పాఠశాలలో మే మందఱము నొక విషయము దర్శించు చుంటిమి. దానిని దమకు మనవిఁ జేయుటకు వచ్చినాను. విష్ణువర్ధన మహా రాజుగారిని సందర్శించునపుడు వారికి సువర్ణ రత్నసముదాయము సమర్పింప దలఁచి, మన యజమాని సమకూర్చుచున్నట్లు విన్నాము. అంతకన్న మనపట్టణ ములయం దుత్పత్తి యగుచున్న పలువిధములైన చేతిపనులను, మనపొలముల యందుఁ బండుచున్న విశేష ధాన్యాదులను, మన యోడలలోను నదుల మీఁద సాగు పడవలలోను ఏనుఁగులు లొట్టిపిట్టలు గుఱ్ఱములు ఎద్దులు మొదలగు వానితోఁగూడిన బిడారముల మూలమునను దిగుమతి యగుచున్న డకా మజిలిన్లు, పారసీకపుఁ దివాచులు, రౌమిక పరిమళ ద్రవ్యములు, టిబెట్టు కస్తూరి, అరేబియా ఖర్జూరము, చీనాపట్టు, కాశ్మీర శాలువలు, దంతపు సామానులు, ఇత్యాదులను మహారాజుగారికి సమర్పించిన యెడల, మనపట్టణములయొక్క యున్నత పరిస్థితులు రాజుగారి కెఱుక పఱచి నట్లగును. ఈ సూచనను దమకుఁ దెలుపుటకు నన్ను మన బాలనగరులు మీ వద్దకుఁ బంపియున్నారు.

కుసుమ :— సాంబమూర్తీ! ఈ తలంపు యుక్తముగ నున్నట్లు తోచుచున్నది. నీ యభిప్రాయ మేమి?

సాంబ:—అవును. బాగుగనే యుండును. అట్లే చేయుదము. మనము కర్షకుల కన్నివిధములఁ దోడ్పడుచున్నా మనియు, కార్మికులకుఁ దగినన్ని పరిశ్రమ శాలల నిర్మించితి మనియు, విదేశ వాణిజ్యము సాగించుచున్నామనియు, విజ్ఞుఁడగు రాజు గ్రహించి, వాణిజ్యాభివృద్ధికి పూనుకొనును. దేశము సుభిక్ష మగును. ప్రజాశోభ యంతరించును.

కుసుమ :— సాంబమూర్తీ! మన బాలనగరుల సలహాకు సంతోషించు చున్నాను. దీనిని మన నగరనాయకులు హర్షింపకపోరు. కానుకల నిట్టి వియే సేకరింపుము! విమలాదిత్య మహీపాలుని పరమేశ్వరీ సందర్శనమున కాహ్వానింతము. దేవాలయము నలంకరింపుము.

సాంబ :— చిత్తము. అటులనే చేయించెదను. సెలవు. (నిష్క్రమించును)

కుసుమ :— మురహరీ! మీ సలహా యోగ్యమైనది. దాని ననువర్తించుట కేర్పాటు చేయించుచున్నాను. సార్వభౌమసమ్మాన కార్యక్రమములలో మీతో డ్పాటు అవశ్యకము.

మురహ :—మాకు నియమింపఁబడు కార్యములను నిర్వహించుటకు మేము సంసిద్ధులము.

కుసుమ :—మంచిది. (మురహారి వెళ్లును.)

## తృ తీ య రం గ ము.

## పరమేశ్వరీ దేవాలయము.

(విష్ణువర్ధన మహారాజు, మంత్రి, విదూషకుఁడు, మూలవిరాట్టున కెదురుగా నిలఁబడి యుందురు. లోపల అర్చన జరుగుచుండును. పురజను లెల్లరును వచ్చి యుందురు. మహారాజుగారికి జయజయనినాదములు వెలయుచుండును. వాసవి తల్లి చెంత నిలువఁబడి, పూవుల గ్రుచ్చుచుండును. విష్ణువర్ధనుఁడు, వాసవీకన్యవంకనే చూచుచు ననిమిషనేత్రుఁ డగును.)

గణాచారి :—(పూజానంతరము - కొంచెము బిగ్గరగా) మంగళ వాద్యముల వాపుచేయుఁడు! అమ్మా! కన్యకలుగా నున్నవారు దేవికి నీరాజనమును బట్టవలయును.

కుసుమ :—తల్లీ! వాసవీ! నీవును నీ సఖులును నీరాజనపుం బళ్లెరమును గైకొనుఁడు!

(వాసవి మఱియుద్దఱు సఖులతోఁ బ్రవేశించి, హారతిపళ్లెరమును గైకొని గేయమును బాలిక లందఱితోఁగలసి పాడును.)

గేయము :— వందన మోమాతా! దేవి! - వందన మోమాతా!

వణిజ్నగర విజయభూత
సత్ప్రజాళి సుప్రభాత! ॥వం॥

లోకపూత!లోక మాత!
లోకానందోపేత! ॥వం॥

సమరాంగణ వీరమాత!
సర్వసర్వంసహా ప్రపూత! ॥వం॥

స్వప్రకాశ! - శక్తి సహిత!
సకలాంతర్యామి మాత! వం॥

విష్ణు :—(విదూషకుని చెవిలో) విదూషకా! ఆ హారతి పళ్లెరమును ముందటఁ బట్టుకొన్న కన్నియను జూడుము! పిమ్మట వివరముఁ జెప్పెదను.

విదూ :—చిత్తము.

(విష్ణువర్ధనుఁడు పుష్పమాలాలంకృతుఁడై దేవీప్రసాదమును గ్రహించును. జయజయధ్వనులతో బయలు వెడలును.)

## చతుర్థరంగము.

## విడిది గృహము.

(విష్ణువర్ధనుఁ డేకాంతముగా నుండును.)

విష్ణు :—వాసవీ! వాసవీ! వాసవీ యని మూడు సార్లుచ్చరించినచో నా జన్మము తరించునేమో!

సీ॥ జిలుగు పావడఁ గట్టి - చిన్నారి పొన్నారి
వన్నె లొల్కెడు వల్లె - వాటు వేసి
బాలచంద్రుని బోలు - ఫాలభాగమునందుఁ
జక్కఁగస్తూరిచే - ర్చుక్క దిద్ది
నిగ్గు లీనెడు సోగ - నెఱికురుల్ జడవైచి
సిగఁజుట్టి పుష్పమా - లికలఁ గట్టి
చిగురు టాకులఁ గేరు - చిన్నియొజ్జని వ్రేళ్ల
రమ్యంబుగాఁ బల్లె - రంబు నుంచి

గీ॥ పొలుపు మీఱంగ భూషణం - బులను దొడిగి
గజ్జె లందెలు ఘల్లంచుఁ - గరము మ్రోయఁ
దల్లి చెంగట నుండెడి - పిల్ల వీవు
నిన్నుఁ జూచెడి భాగ్య మిం - కెన్నడొక్కొ!

—అహా! యేమీ! ఆ దృశ్యము! ఆ దృశ్య మింకను నా హృదయ ఫలకమునఁ జిత్రితమగుచున్నదే! నీవు నిజముగా ధన్య జీవివి! (పైకిఁజూచి) ఏమి నీ యందము, ని చందము, నీ హొరువు, నీ మురువు! (కొంచెమూరకుండి) ఛీ! నే నెంత మందమతిని. లేదు, వాసవి లేదు. భ్రాంతి. (ఆలోచనా నిమగ్నుఁడై యుండును.)

విదూ :—(ప్రవేశించి ఆతురతతో) మహారాజా! మహారాజా!

(విష్ణువర్ధనుఁడు పలుకకుండును.)

విదూ :—(కొంచెము యోచించి) ఓహో! సార్వభౌములు ధ్యానమును జేయుచున్నారు కాఁబోలు !

విష్ణు :—(కొంచె మూరకయుండి) విదూషకా! నీవా! మంచి సమయము నకే వచ్చినావు. రమ్ము. కూర్చుండుము.

విదూ :—కూర్చొనెదను గాని, యేమి మీ విషయము నాకు బొత్తిగా నర్థము గాకయున్నదే?

విష్ణు : ఏ మది విదూషకా ?

విదూ :—మీ కేమి కనుపించును? నేను బ్రాహ్మణుఁడను, బ్రహ్మచారిని గదా? నా కేమైన, తినుటకుఁ దిండి, ఉండుటకు నిల్లు ప్రత్యేకముగా నేర్పాటు చేసి, విచారింపఁబని లేదా?

విష్ణు :—నీ వం దందుఁ దిరుగుచుండిన, నీ వెం దున్నావని వెదకుదురు? ఆ యేర్పాటు లన్నియుఁ జేసెదరుగాని, విదూషకా రమ్ము! ఇక్కడ గూర్చుండుము!

విదూ :— (కూర్చుండి) కూర్చుంటిని. ఇకఁ జెప్పుము.

విష్ణు:— మన్మధుఁడు నన్నెక్కువగా బాధించుచున్నాఁడు విదూషకా!

విదూ :— మన్మథుఁడా! (ఆలోచించుచు) రాజులలో నెవ్వరికి నిట్టిపేరు ఉన్నట్లు లేదు. పోనీ బంధువులలో నీ పేరుగలవా రెవ్వరును గనుబడరే! మన్మథుఁ డెవఁడు ప్రభూ?

విష్ణు :— (నవ్వి) ఓహో! మఱచితిని. నీవు బ్రహ్మచారివి గదూ! అదిగాదు విదూషకా! ఆ కన్యక విషయము.

విదూ :— ఏ కన్యక?

విష్ణు :— ఆ పరమేశ్వరీ దేవాలయములో హారతి పళ్లెరమును బట్టుకొనిన వాసవీకన్యకను నీవుఁ జూచియుండలేదా?

విదూ :— ఓహో! అదియా! ఆఁ...... అట్లైన ముగ్గురు గదా హారతి పళ్లెరమును బట్టుకొనినది. అందు వాసవి యెవరు?

విష్ణు :— ఎవరో నీవే తెలిసికొనుము, విదూషకా!

విదూ :— ముగ్గురూ కన్యకలే, వారిలో భేద మే మున్నది? అసలు విషయ మేమో చెప్పుడు.

విష్ణు :— ఆ వాసవీ సౌందర్యము నాహృదయము సాక్షించినది విదూషకా!

విదూ :— అంటే?.

విష్ణు :— ఎటులైనను బరిణయమాడవలెనని.

విదూ :— (ఆశ్చరుపుతో) ఆ వణిక్కన్యనా?.

విష్ణు :— నీ కంత చులకనగా నున్నదా, విదూషకా! నీ వా సౌందర్యమును సరిగాఁ జూచియుండవేమో!

ఉ॥ కట్టు ప్రసూనవాసనలఁ - గ్రమ్ముపదారు పసిండిమేనుతోఁ
బెట్టిన పండువెన్నెలకు - బ్రీష నొసంగెడి లేతనవ్వుతోఁ
జిట్టిబెడంగు తేంట్లను వా - సించెడు కోమలనీలవేణితోఁ
బుట్టిన వాసవిం గనని - పుణ్యము లేటికిఁ బూజ లేటికిన్॥

విదూ :— మహారాజా! అందచందములఁ నందతికన్న మిన్నలగు నంతఃపుర కాంత లంద ఉండగా, నిది యేమి పిచ్చి? అయినను నీవుత్తమ క్షత్రియుఁడవైయుండి చేరిపిల్లనా వేడునది? రమ్ము! మా వంశములో నట్టి కన్యకలను వందమంది నిప్పించెదను లెమ్ము.

విష్ణు :— అట్టి కన్నియలమాట నటుంచుము. ఆ కన్నియ నిప్పింపుము.

విదూ :— అయిన...ఆ కన్నియ యంత సౌందర్యవతి యనెదవా?

విష్ణు :— అట్టి సౌందర్యవతి యీ లోకమునఁ గాదు గదా ముల్లోకములలో నెందు నుండ దనియే నా నమ్మకము. ఆ సౌందర్యామృతమును ఆ చూపుల మధువును దొప్పలతో జుర్రుకొంటిని, విదూషకా!

సీ॥ మణిమయ తాటంక - ఘృణిపుంజ మొకవంక
మెఱమెచ్చుఁ దళతళ - మెఱయుచుండ
అభ్యంజనంబుఁ గొ - న్నందునఁ గుంతలం
బులు నిండునెలమోము - మూయుచుండ
పసుపుపచ్చని నిగ్గుఁ - బచరించు జరిపట్టు
పుట్టంబుమైచాయ - నెట్టుచుండ
కమనీయ తపనీయ - ఘనసార కుసుమహా
రాళి వక్షంబుపై - వ్రేలుచుండ

గీ॥ ద్రాక్షకన్నను మాధురీ వాక్య - చయముతోడ
మాధవీ సౌరభ దరహాస - రుచులతోడ
బాలికలతోడ గేయంబుఁ - బాడుచుండు
కన్యకా దృశ్య మిప్పుడుఁ - గాంచుచుంటి.

విదూ :— అంత సౌందర్య మున్న దని మీకుఁ దోఁచేని అవశ్యము పరిగ్రహింపుఁడు.

విష్ణు :— నీవు ప్రప్రథమమునుండియుఁ జూచియుండ లేదు. మొదట వాసవీ కన్యక తల్లిచెంత నిలఁబడి సుమ మాలికను గ్రుచ్చుచుండినది. ఆదృశ్య మింకను నాకుఁ గన్నులకుఁ గట్టినట్లున్నది, విదూషకా!

ఉ॥ తల్లికిఁ జెంగట న్నిలిచి - తద్దయు నెమ్మొగమంను నిండుజా
బిల్లిహసారంగు వెన్నెలల - నేడ్కను జిర్నగ వొప్పుచుండ, మే।
నెల్ల మనోజ్ఞ రత్నమయ - హృద్య విభూషణముల్ చెలంగ, రా।
జిల్లిన యల్ల వాసవి స - సింగ కలంగించెఁ గరంబు నా మదిన్ ॥

విదూషకా! నే నిచ్చట నుంటి నేగాని, నా హృదయ మంతయు నచ్చటనే యున్నది. ఏ యుపమానములుఁగూడ నా కన్యకకు సరిపడవు వాసవికి వాసవియే సాటి. ఏమని వర్ణింపఁగలను ?

విదూ :— అది సరియే గాని ప్రభూ! ఉభయత్ర అనురాగ మున్నపుడే గదా, పరిణయమాడుట, ప్రణయ సౌఖ్య మనుభవించుట.

విష్ణు : ఎంత పిచ్చివాఁడవు విదూషకా ! పరిణయ మాడిన పిమ్మట ననురాగము కుదురక పోవునా ?

విదూ :—సరే. బాగున్నది మీ యోచన. అనురాగము లేనప్పుడు పరిణయ మెట్లగును ?

విష్ణు :—పరిణయమున కంత ప్రయత్న మవసరము లేదు, విదూషకా ! ముందు నీవు ఏడు రోజులలో నన్ని విధముల ననుకూలముగ నుండు నొక ముహూర్తమును నిర్ణయింపుము.

విదూ :— ఏడు దినములలో మంచి ముహూర్తమా? బాగున్నది. అసలిది యధిక మాసము. ఈ మాసమునందు ముహూర్తములే లేవు.

విష్ణు :— ఈ మాసమునందు ముహూర్తములే లేవా? అక్కఱకు రాని

యీ జ్యోతిశ్శాస్త్ర ముండిన నేమి ఊడిన నేమి? శాస్త్రమును నీవు చక్కగాఁ బరిశీలించితివా?

విదూ :— (తలపంకించి) ఏమి చేయుదును? రాజాజ్ఞ. (కొంచెము యోచించి) ఈనాఁడు కలియు, తారాబలము లేదు. చవితి తిథి పనికి రాదు. పంచమీ దినమున నేలగ్నము గూడఁ గుదురకయున్నది. షష్ఠితిథి లాభించదు. సప్తమికిఁ జంద్రబల మేలేదు. అష్టమీ నవములు కష్టదివసములు. పోని, దశమి చూచుకొందునా? దశమి యెనిమిదవ రోజగుచున్నది. ఎట్లు చేయుదును బాబ్బా! (కొంచెము మూగకయుండి) ఆఁ... జ్ఞప్తికి వచ్చినది. (చిటికవేసి) మహారాజా! మీకే రోజున నైనను ముహూర్తముఁ బెట్టఁగలను.

విష్ణు :— అది యెట్లు విదూషకా?

విదూ :— మీ కెందులకు? మీ కే రోజునఁ గావలెనో కోరుకొనుఁడు.

విష్ణు:— అట్లైన నేఁడవ రోజున నే ముహూర్తమును నిర్ణయింపుము. ఏవో తత్సంబంధమగు కార్యకలాపము లుండును గదా!

విదూ:—ఏడవ నాఁడన్న నవమీ సాయంకాలము గోధూళిలగ్నము మంచిదని తోచుచున్నది.

విష్ణు :— అట్లైన, విదూషకా! నీవు పోయి, ప్రధానమంత్రి విజయశీలునితో నివ్విషయ మంతయు వివరముగాఁ జెప్పి, కుసుమశ్రేష్ఠిని బిలుచుకొని రమ్మని చెప్పుము.

విదూ:— చిత్తము. సెలవు పుచ్చుకొందును. (నిష్క్రమించును.)

## పంచమరంగము.

### విడిది గృహము.

(విష్ణువర్ధనుఁడు, విజయశీలుఁడు, కుసుమశ్రేష్ఠి ఉచితాసనాసీనులై యుందురు.)

విజయ:— కుసుమశ్రేష్ఠిగారూ! తమరు చేసిన గౌరవమునకు, తమ పట్టణముల యొక్క యౌన్నత్యమునకు, తమరు సమర్పించిన కానుకలకు, తమ పరమేశ్వరీ సేవానురక్తికిని, మహారాజుగారు మిక్కిలి సంతోషించినారు, మీ యాతిథ్యము పరమోత్తమము.

కుసుమ:— ఏనో, మా శక్త్యనుసారము గావించి మా భక్తిని దెలుపు కొంటిమి. మహారాజుగారలంతమట్టుకు హర్షించినచో మాకుఁ గావలసిన దేమున్నది?

విజయ:— ఆఁ... విన్నుట, కుసుమశ్రేష్ఠిగారూ! తమ పుత్రికయగు వాసవీ కన్యకను మహారాజుగారు పరిణయమాడఁ దలంచినారు. మీ యనుమతి నాశించుచున్నారు.

కుసుమ:— (విషణ్ణహృదయుఁడై) మ...హా...రా...జు...గా...రు... వి...వా...హ...మా...డఁ...ద...లఁ...చి...నా...రా?

విజయ:— అవును. మీ యదృష్టరేఖ ఫలించినది. మీ కొమరిత పట్టపుదేవి కానున్నది.

కుసుమ:—(హృదయకంపముతో) మా వాసవి వివాహమున కర్హురాలు గాదే!

విజయ:— ఎందువలన? మహారాజుగారే స్వయముగాఁ గోరునపుడు అర్హత కేమి సందేహము?

కుసుమ:—అదిగాదు. వాసవీకన్యను మా వంశీయులగు పదునెన్మిది పట్టణముల వారును గలసి ఆ పరమేశ్వరీపూజకు నియోగింప నిశ్చయించియున్నారు. అదియునుంగాక, మా వంశమునఁ గన్యకలు పెండ్లాడి తీఱవలయు నని నిర్బంధము లేదు. మఱియును వాసవికిఁ బరిణయకాంక్ష యే లేశము నందును లేదు.

విజయ:— ఇంతియేనా ఆటంకము? దానికేమి, మఱియొక కన్నియను బరమేశ్వరీపూజకు నియమింపవచ్చును. వాసవి సౌందర్యవతియగు కన్యక గనుక, మహారాజుగారు కోరుచున్నారు. కాలము గడచిన నేమగునో! సత్వరముగా సమ్మతింపుఁడు.

కుసుమ:—ఇది మిక్కిలి యపరాధము. మా కులదేవతయగు నా పరమేశ్వరి యెడ నింతటి యపరాధమును గావించుటకు మా వారలెవ్వరు నంగీకరింపరు.

విష్ణు:—(కోపముతో) విజయశీలా! ప్రార్థించుచున్నా వేమి? నా మనోభీష్టము దెలింగింపుము.

విజయ:— చిత్తము కుసుమశ్రేష్ఠిగారూ! మహారాజుగారికిఁ గోపము వచ్చు వఱకు ఆలస్యము జేసిన లాభము లేదు. మీరు కన్యక నియ్యనిచో

మహారాజుగారు మీ పదునెన్మిది పట్టణములను నాశముఁజేసిరైనను, వాసవీ కన్యకను బరిణయమాడుటకు నిశ్చయించుకొని యున్నారు.

**కుసుమ:**— స్వధర్మములను దిరస్కరింపఁజాలము, ప్రభూ!

**విష్ణు:**— కుసుమశ్రేష్ఠిగారూ! మేముగా నడుగుచున్నందున మీకు జులకనగా నున్నట్లు తోచుచున్నది. ఇదిగో! యేడుదినములు గడు విచ్చుచున్నాను. పోనీ, మీ వంశీయు లందఱును గలసిగదా, ఆ కన్యను పరమేశ్వరీ పూజార్థము నియమించినది. ఈ యేడు దినముల లోపుగ, మీ రెల్లరును గలసి యోచించుకొని, పరిణయమును గావించెదరో, వంశనాశనమున కియ్య కొందురో, తెలియజేయుఁడు. విమలాదిత్యుఁడు వాసవీకన్యకాపరిణయమును మానుకొనజాలఁడు.

**కుసుమ:**— మా పదునెన్మిది పట్టణముల వారమును గలసి యోచించుకొనెదముగాని, వివాహము నొల్లని కన్యను నిర్బంధించు టెట్లు?

**విజయ:**— మహారాజుగారే యవకాశ మిచ్చినపుడు మీ రిట్లు సంభాషించుట పాడి గాదు. త్రిభువనాంకుశ, భూపమహేంద్ర, మున్ముడిభీమ, బిరుదాంకితుడగు విమలాదిత్య సార్వభౌముని ఏ కన్యక వరింపకుండును?

**కుసుమ:**— నగరస్వాములతో సంప్రదించుటకు నాక్షేపణ లేదు. సంప్రదింపు వఱకే నా వాగ్దానము. సెలవు.

**విష్ణు:**— మంచిది. (కుసుమశ్రేష్ఠి వెళ్లిపోవును.)

**విజయ:**— ప్రభూ! నాకు మఱియొక యోచన తోచుచున్నది. మన సేనాధిపతిని బిలిపించి, యీ పదునెన్మిది పట్టణములలో ప్రచారముఁ జేయింతుమా? అట్లు గావించినచో నెల్లవారును దప్పక మన పక్షమున మాట్లాడుదురు; పరిణయము జరుగును. రమణిని గ్రహించుటకుఁ గూడ రణరంగ మెందులకు?

**విష్ణు:**— అవును. నీ సలహా మిక్కిలి బాగున్నది. అట్టులనే కావింతము. ఎవరురా అక్కడ?

**భటుడు:**—(ప్రవేశించి) చిత్తము ప్రభూ! ఏమి సెలవు?

**విజయ:**—మన సర్వసేనాధిపతి కొత్వాలును బిలుచుకొని రమ్ము.

భటుడు:— చిత్తము. (వెడలిపోవును)

విష్ణు:— విజయశీలా! కొంత సైన్యము నిక్కడ నుంచుట మంచిది.

విజయ:— అవును, వాసవిని బలస్థలముఁ జేర్చుటకు వీలనుపడకుండ వలయును.

కొత్వాలు:— (ప్రవేశించి) చిత్తము ప్రభూ! ఏమి ఆజ్ఞ?

విష్ణు:—ఓహో! కొత్వాలూ! అటు కూర్చుండుము. (కొత్వాలుకూర్చుండును.)

విష్ణు:— కొత్వాలు! ఈ పెనుగొండ కోటగోడలచుట్టును డేరాలు వేయించి, సేన నంతయు నిచ్చట నేయుంచుము. వాసవీకన్యక తప్పించుకొనిపోకుండ జాగరూకతతో మెలఁగ వలయును. వార్తలే నాకు కొనాడు పంపుచుండ వలయును. విజయశీలుఁడు నీకు వివరించి చెప్పువిధముగా నీ వీ పదునెన్మిది పట్టణములలోఁ బ్రచారముఁ గావింపవలెను. మన కోమటిందుని సహాయ మెక్కువగాఁ గైకొనుము. అతఁడు మిక్కిలి సమర్థుఁడు.

కొత్వా:— చిత్తము. అట్లనే చేయుదును.

విష్ణు: | విజయశీలా! కొత్వాలు చేయవలసిన కార్యక్రమమును చక్కగా నిర్ణయింపుము.

విజయ, కొత్వా:— చిత్తము. (నిష్క్రమింతురు)

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

### తిప్పయ్యసెట్టి గృహము.

(తిప్పయ్యసెట్టి యేకాంతముగా నాసీనుఁడై యుండును)

తిప్పయ్య:— (తలపంకించి) ఎల్లుండి పెనుగొండలో సభ. పెనుగొండవారి కిక్కడ పట్టునలలో నున్నట్లు తెలియుచున్నది. వారెప్పుడు గూడ నితరులకు బ్రాధాన్య మియ్యరు. మా నలపాల నెపుడు ను అలక్ష్యముగాఁ జూచు చుందురు. కుసుమసెట్టి యే విషయములో గొప్పవాఁడు? ఆ నలుగురు పెద్దఁ జేసినందునఁ దా నొక పెద్దవాయినాఁడు. అంతిమాత్రమున విజ్ఞుఁ డగునా? నేను మాత్ర మెందులోఁ దక్కువవాడను? నా కాతనిపాటి సమర్థత లేదా? మావారి కెన్ని మారులు చెప్పినను చెవికెక్కుట లేదు. ఇప్పుడిప్పుడు బోధ పడుచున్నది పెనుగొండవారి తత్వము. కొత్వాలుగారి పట్టణము లన్నింటి

లోఁ బ్రచారముఁ గావించుచున్నారు. వాసవీ కన్యక నియ్యనిచోఁ బదునెన్మిది పట్టణములను నాశనముఁ జేయుటకై నిశ్చయ మైనదఁట. పెనుగొండలో సైనికదళము లనేకము లున్నవఁట. చాళుక్య సామ్రాజ్యాధిపతి యగు విష్ణువర్ధన మహారాజుతోడనా విరోధము? నే నిప్పుడే యిక్కడి వార లందఱికిని లేఖలఁ బంపించి పెనుగొండసభకుఁ బ్రతినిధులను బంపునట్లు చేసెదను. ఎట్లైనను వాసవీకన్యకను మహారాజున కిచ్చి, వివాహమును జరిగించుట శ్రేయస్కరము. ఇందువలన మనము సామ్రాజ్యమున నెక్కువ పలుకుఁబడిని సంపాదింపవచ్చును. మహారాజుగారి వలనఁ గలుగ నున్న గొప్ప ప్రమాదము తప్పిపోవును. నా యభీష్టసిద్ధికి మంచి తరుణము లభించినది. పట్టుఁదలతోఁ బనిఁ జేసినఁగాని, పలుకుఁబడి గలుగ నేరదుగద? అన్ని పట్టణములకును నక్వ్యముల పై [illegible] బంపించెదను. కొందరికిఁ బరిస్థితులు స్వయముగాఁ దెలిపెదను.

(అని వెడలిపోవును.)

## ద్వితీయరంగము.

### పెనుగొండ సభామంటపము.

(పదునెన్మిది పట్టణములనుండియుఁ బ్రతినిధులు వచ్చి[illegible] కుసుమ శ్రేష్ఠి యధ్యక్షస్థానమున నుండును.)

కుసు:— సభ్యులారా! ఈనాఁడు మన మెల్లర మెందులకు సమావేశ మైతిమో పత్రికలవలన నెల్లరకును దెలిసియే యున్నది. మన పట్టణమునకు విష్ణువర్ధన రాజు వచ్చినపుడు, శక్త్యసారముగా నాతిథ్యము నిచ్చి శ్రీపరమేశ్వరీ దేవాలయమునకుఁ దీసికొనిపోయి అర్చనచేయించి ప్రసాద మిప్పించితిమి. అక్కడ మహారాజు వాసవీ కన్యకను జూచి, మోహించి, నన్నుఁ బిలిపించి, ఆమెను వివాహమాడఁ గోరెను. వాసవి పరిణయమున కనర్హురాలని నుడివితిని. పరమేశ్వరీపూజార్థము నియమింపఁబడిన బాల యని విన్నవించితిని. మహారాజు నా మనవిని బెడచెవిని బెట్టి, యేడు రోజులు గడు విచ్చి, యీలోపల మన మెల్ల యోచించి నిశ్చయమును దెలుపవలసిన దని చెప్పి, వెడలిపోయినారు. ఇప్పుడు మన పదునెన్మిది పట్టణముల నుండియుఁ బ్రతినిధులు వచ్చియున్నారు. కావున నందఱి యభిప్రాయములను వినఁగోరుచున్నాను. తిప్పయ్యసెట్టిగారూ! తమ యభిప్రాయ మేమి?

**తిప్పయ్య:**—(లేచి) ఈ విషయములోఁ గుసుమ శ్రేష్ఠిగారు రప్పుడే తమ యంగీకారమును దెలిపినయెడల నెంతయో బాగుండెడిది. మహారాజుగారు స్వయముగా మన కన్యకను గోరినపుడు మనము మఱియొక విధముగ యోచించుట సమీచీనముగా లేదు. మనము కన్యక నియ్యమని చెప్పినను, పరిణయము తప్పదు. గౌరవముగా మనమే కన్యను సమర్పించినచో నెంతయో ఖ్యాతి గలుగును. చాళుక్య సామ్రాజ్యాధిపతి మన యల్లుఁ డగును. మహారాజుగారి యభిమత మీడేర్చుటయే యుత్తమ పద్ధతి యని నాకుఁ దోచుచున్నది. అందఱి యభిప్రాయ మింతియే యని తలంచెదను.

**కుసుమ:**— భీమయ్య శ్రేష్ఠిగారూ! తమ యభిప్రాయమును సెలవిండు.

**భీమ:**— శ్రేష్ఠిగారు! సభ్యులారా!

ఉ॥ ఉర్విఁ గలన్ని నాళ్లు కుల - మూఁగును పేరును నిల్పుచుండియొక్క
సర్వమెఱుంగు కై వడిఁ బ్ర-శ స్త దిగంతనితాంత విశ్రుతా
ఖర్వయశంబు నొంది మనఁ-గావలె నంతియగాని మూర్ఖులై
దుర్విధులై కళంకముల-దొగ్గెడువారల జన్మమెట్టిదో!

కులగోత్రాదులను వదలిపెట్టి, మన కనీస ధర్మము నైన నిలుపుకొనజాలని యీ శరీరము లుండిన నేమి, ఊడిన నేమి? ఆత్మసాక్షిగా ఆనాఁడు మన మెల్లరమును వాసవీకన్యకను లోకమాత సేవకై నియమించి యుంటిమి. ఆ నాటి నుండియు వాసవీకన్యక యనఁగా సాక్షాత్పరమేశ్వరియే యని మన మెల్లరము భావించుచున్నాము. ఈ పవిత్ర మూర్తి నొక పురుషున కిచ్చి పాణిగ్రహణ మొనర్చుటకు మన హృదయము లెట్లు సమ్మతి పడును? మనము కుబేర వంశజులము. వారు చాళుక్యులు. వారికిని మనకును సంబంధ మెప్పటికిని గుదురదు. ప్రాణము పోయినను వాసవిని నిర్బంధించుట తగదు. ఇదియే నా యభిప్రాయము.

**కుసుమ:**— వెంకప్ప సెట్టిగారు! తమ యభిప్రాయమును సెలవిండు?

**వెంకప్ప:**— మనము వీని నన్నింటిని యోచించుకొనిన లాభము లేదు. అతఁడు ప్రభువు. అతని యాగ్రహమున కడ్డు లేదు. పిమ్మట మనము పశ్చాత్తప్తుల మైన ప్రయోజన ముండదు. అతని యభీష్టము నెర వేర్చుటయే యుక్తము.

**కుసుమ:**— తిమ్మప్ప శ్రేష్ఠిగారు! తమ యభిప్రాయమును దెలుపుఁడు?

**తిమ్మప్ప:**—పూజ్యులారా!

మ॥ మలభాండం బగు పాడుపొట్ట కొఱకై - మానమ్ము వోనాడి, ని
చ్చలు జీవించుట కంటె సంఘమున నై - చ్యం బుండునే వేఱు? క
న్నులఁ గానంబడుచుండు దృశ్య మిది య-న్యుల్ క్రూరులై సంఘమున్
నలుపం జూచుచు నుండ నూఱటను జెం - దంగ వచ్చునే యెంతయున్?

ధర్మ పథమును దప్పక మనము నిల్చియుండినచో పరమేశ్వరీ మాతయే మనలను రక్షింపఁ గలదు. మానము పోయిన పిమ్మట ప్రాణములు మాత్ర మెందులకు? సర్వాంతర్యామి యగు విశ్వమాత మతస్థులము మనము. త్రిమూర్తి ప్రాధాన్యమైన వివిధ దేవతా విగ్రహారాధనల తోను, వర్ణ వివక్షతోను, షోడశ సంస్కారములతోను గూడిన పౌరాణిక మతము వారిది. వా రనుసరించు వర్ణవిభజనఁ జూచిన మనము వైశ్యుల మగుదుము. వారు క్షత్రియులు.

చ॥ ఆదియును గాక, స్వీయకుల - మన్ననొ, తొల్లిటి నుండి ధాత్రిలో
విదితయశంబుఁ గన్నది. ప - వి్త్రతఁ గొన్నది, నేడు మీరు బు
ద్బుద సమ దేహ సౌఖ్యములఁ - బొందుట కాస వహించి దీనికిన్
గుదురగు నట్లు మచ్చ నిడఁ - గూడఁగు ప్రీడను గూర్పఁ గీడగున్॥

ఎట్టులైనను మన ధర్మమును నిలువఁ బెట్టుట ప్రకృత కర్తవ్యము.

సదాసివసెట్టి:— (లేచి) ఈ శుష్క వేదాంత మెందుకు? పిడివాద మేల? ధర్మమో, అధర్మమో, ప్రకృత పరిస్థితిని గమనింపవలయును. ఒక్క కన్నియకొఱకు నీ పదునెన్మిది పట్టణముల వినాశనమున కంగీకరించుటయా! ఇది ఘోరకృత్యము. పోనీ రాజుతో యుద్ధముఁ జేయుద మన్నను మనవద్ద తగిన పరికరము లున్నవా? రథ గజ తురగ పదాతులతో దండయాత్రఁ బ్రారంభించినచో మన మెదురు నిలువఁ గలమా?

భీమయ్య:— (మఱల లేచి) వణిజోత్తములారా!

సీ॥ బల మాన పౌరుషం - బు లడంగి పోయెనే
భారతావనియందుఁ - బ్రభవ మంది?
రక్తమాంసంబుల - రాణ యడంగెనే
యమలిన భోజనం బారగించి?
పుడమి యొడయు బుద్ధిఁ - బొగడ నోరాడెనే
వణిగన్వయంబందు - జనన మంది?

అధికారులకు భయం - బంది చరింతురే
గౌరవస్థానంబుఁ - గాంచి యుండి?

గీ॥ మీదు సంఘంబు మీ జాతి - మీదు ఘనత
మంటఁ గలపంగఁ జూతురే - మానము విడి?
నీతిఁ దప్పంగఁ బొల్పడ - నేడు మీకు
కలుగునే గతి యిహపరం - బులను నైన?

స్త్రీల నీ విధముగా నిర్బంధించుట స్వీయాన్వయ ధర్మవిరుద్ధము. మన వంశమున స్త్రీకి వ్యక్తి స్వాతంత్ర్యమును గౌరవస్థానమును గలవు. పౌరాణిక మతానుసారులలో స్త్రీలకు వివాహము నిర్బంధము: భార్యలు దాసీతుల్యలుగ భావింపఁబడుదురు, మరియును, చాళుక్యులు మత్స్యమాంస భుక్కులు. మనము శాకాహారులము. వారి రాజసికమునకును మన సాత్వికమునకును పొందిక యేర్పడఁజాలదు. జాతి భ్రష్టతకు, నీతిభ్రష్టతకు, ధర్మభ్రష్టతకు నే మహనీయులును అంగీకరింపఁ జాల రని నేను ఘంటాపథముగఁ జెప్పుచున్నాను. అని బల్ల గ్రుద్దును.

తిప్పయ్య:—(లేచి) ఆగు. ఆగుఁడు. బాగుగ నే యున్నది మీ యుపన్యాసము! ఎక్కడి జాతి? ఎక్కడినీతి? ఏటి ధర్మము? ఎట్టి మతము? ప్రాణములు పోవునపుడా, నా జాతి. నా నీతి, నా మతము అని ప్రగల్భములు పలుకుట?

శా॥ ఏ యే ధర్మము నిల్పఁబూనినను, నే - యే నీతులన్ బోల్చినన్
న్యాయంబున్ మతమున్ స్వజాతి నియమం-బాసించినన్ సుమ్మ, ముం
దాయుర్దాయము, దేహదార్ఢ్యమును బొం - దై యుండినన్ గాదొకో,
కాయం బొక్కటి ధర్మసాధనముకై - గాంచంగ నాద్యం బెకా?

తిమ్మప్ప:— (లేచి) తిప్పయ్యసెట్టిగారూ! కీర్తికాయము శాశ్వతము. ఈ భౌతిక శరీరము శాశ్వతము గాదు. పుట్టిన దేహ మెప్పుడైనను గిట్టక మానదు. ధర్మరక్షణకై జీవితమును ధారవోయుట యుత్తమ మార్గము.

చ॥ కులమును మానమున్ దెలుపఁ - గోరుచు నల్వురితోడఁ జచ్చుటల్
కలకలఁ జెల్లు పెండిలికిఁ - గాదె సమాన మటంద్రు పండితుల్
ఇల నిఁక గంజినీళ్లకయి - యే, మన మిప్పుడు తుచ్ఛజీవితం
బులు నిలుపంగఁ బూనొక్కవఁ బూజ్యులు మిమ్ములఁ జూచి మెత్తురే?

అదియునుగాక, మన పూర్వులనుండి యనాదిగా వచ్చిన గోత్రములు మనవి. కల్పిత గోత్రములు వారివి. మేనరికము మన ధర్మము. తన్నిషేధము వారి మతము. ఈ విధముగా నెట్లు పరికించినను, నే విషయములో గూడ వారికిని మనకును సమానమగు ధర్మ మొక్కటియును లేదు. పరమేశ్వరీ మాతను హృదయమునఁ బదిలపఱచుకొనిన మన కెట్టి ప్రమాదమును రాదు నిర్మాణ కార్య క్రమమును యోచింపుడు.

తిప్ప:— (లేచి) అందుకు మేము సమ్మతింపము. మీ పెనుగొండ పట్టణము వారు మాత్రమే ధర్మ మని మత మని కల్పించుకొన్నట్లున్నది. ఏవో కుయుక్తులతో మీ వాదమును నెగ్గించుకొనఁ దలఁచిన ట్లున్నది. మా పదు నేడు పట్టణములవారము మీ వాదము నెంత మాత్రము నంగీకరింపము.

కుసుమ:— (లేచి) సభ్యులారా! ఇప్పుడు వారివారి యభిప్రాయములు నాకు బోధ పడినవి. వాసవీకన్యక నా పుత్రిక. ఈ విషయలో నేనును యోచించుకొని, కన్యకాభిప్రాయమును గైకొని, కర్తవ్యమును నిర్ణయించుకో వలసి యున్నది. తా మెల్లరును సభకు విచ్చేసి యభిప్రాయముల నొసంగి నందులకు నెంతయుఁ గృతజ్ఞుఁడను. ఈ నాఁ డింతటితో సభ ముగింతము.
(కుసుమసెట్టి వెడలును. అతని వెంట పెనుగొండ ప్రతినిధులును బయలుదేరుదురు.)

తిప్పయ్య:— సదాశివ సెట్టీ! ఈ పెనుగొండవా రెప్పుడును మన మాటలను వినరు. మన మిప్పుడు వల్లె యంటిమేని, మన కందఱకును గొప్ప ప్రమాదము వాటిల్లును. ఉపేక్షించుటయుఁ బ్రమాదమే. మన మిప్పుడు తక్షణమే మహారాజుగారిని దర్శించి మన నిర్ణయమును బెనుగొండవారి ప్రగల్భములను దెలుపుకొన్నయెడల మన కెంతయో శ్రేయస్సు కలుగును.

సదాశివ:— అవును, మనకుఁ గలుగ నున్న గొప్ప ప్రమాదముగూడఁ దప్పి పోవును. మన పదునేడు పట్టణముల వారమును బెనుగొండవారి భావములతో నేకీభవింప లేదని స్పష్టముగా మహారాజుగారి కెఱింగింప వచ్చును.

తిప్పయ:— అట్లైన అవశ్యము మనము పోవు పరిస్థితులు మన పట్టణముల వారి కెఱుకపఱచి సార్వభౌముని దర్శింతము.

(నిష్క్రమింతురు.)

## తృతీయ రంగము.

### కుసుమశ్రేష్ఠి గృహము.

(కుసుమశ్రేష్ఠి కుసుమాంబ వాసవీకన్యక కూర్చొనియుందురు.)

కుసుమ:— (ఆలోచనా నిమగ్నుఁడై యుండును.)

కుసుమాంబ:— అమ్మా! వాసవీ! నీ కారోగ్యము బాగు లే దని విన్నాను. ఎట్లున్నది తల్లీ?

వాసవి:—అనారోగ్య మేమియును లేదమ్మా! బాగుగ నే యున్నాను తండ్రీ! ఏమిది? మీ రేదో దీర్ఘాలోచనలో నున్నట్లు గనఁబడుచున్నారే?

కుసుమ:— అవును తల్లీ!

వాసవి:— ఎందును గుఱించియో చెప్పవగునా, తండ్రీ?

కుసుమ:— నీ విషయమే.

వాసవి:— (అచ్చెరువున) నా విషయమా? ఏమి నాన్నా?

కుసుమ:—(కంటఁ దడిఁ బెట్టుకొని) తల్లీ! ఎన్నియో నోములు నోచి నిన్నుఁ బడసితిని. ఆనాడు నీ యభీష్టము నెరవేర్చుటకొఱకును, ప్రజానీకము యొక్క కోరికను నెరవేర్చుటకొఱకును, నిన్ను లోకమాతసేవకై యర్పించినను, నీపై నెలకొన్న యపత్య ప్రేమ వదలిపోలేదు. నీవంటి పుత్రిక పుట్టినందులకు ధన్యుల మైతి మనుకొనుచు, పట్టరాని యానంద మనుభవించితిమి. విష్ణువర్ధనుఁడు నీపై మోహముఁ జూపుట, పరిణయము దగ దని నేను వాదించనను అతఁడు పట్టు విడువకుండుట వినియే యుందువు. నిన్నటి సభలోఁ దిప్పయసెట్టి మొదలగువారు నిన్ను రాజున కిచ్చి ఉద్వాహ మొనర్పుమని వాదించినారు. ప్రాణములు పోయినను మన బాలను నిర్బంధపరుపరాదని పెనుగొండ నగరమువారు ప్రతిజ్ఞను జేసినారు. వాసవి నియ్యనిచో పదునెన్మిది పట్టణములను నాశనముఁ జేసెద నని ప్రభువు పలికి పోయినాఁడు. నీతోఁ జెప్పుటకు నాకు నో రాడుట లేదు. పరిణయ విషయములో నాకే యిష్టము లేనపుడు నిన్నే మని యడుగుదును తల్లీ? ముందు వెనుకలు నాకు గోచరించుట లేదు.

వాసవి:—నాన్నా! యింత మాత్రమున కంత విచార మేలకే నన్ను గుఱించి పదునెన్మిది పట్టణము లెందుకు ధ్వంసము గావలెను? స్త్రీకి స్వాతంత్ర్య

మున్నది గదా? అపత్నమయములో నగ్నిప్రవేశముఁ గావించుట స్త్రీ ధర్మము గదా?

కుసుమాంబ:— అగ్నిప్రవేశమా? (కన్నీరు విడుచుచు) ఈ కుసుమ కోమల గాత్రమును అగ్నిదేవుని కాహుతిఁ జేయుటయా? నా ముద్దుల పట్టీ! నీసాహసము నే నెట్లు సహింపగలను? నిండు ప్రాణములతో నున్న నీ శరీరము నగ్ని కొక యింధనముగ భావించుటకు మనస్సు రాదు, తల్లీ!

కుసుమ:—తల్లీ! నీవే యగ్ని ప్రవేశ మొనర్చిన, మే మసలు జీవింపగలమా? (కన్నీరు విడుచును)

వాసవి:—తండ్రీ! విచారము వలదు. (లేచి నిలువఁబడి) తల్లి దండ్రులారా! ఒక్కపరి నావైపుఁ జూడుఁడు.

కుసుమ, కుసుమాంబ:— (చూచి) ఆహా! ఆ లోకమాత పరమేశ్వరివా? (చేతులు జోడించి నమస్కరించుచుందురు)

కుసుమ:— ఆహా! తల్లీ! పరమేశ్వరీ! ఏమా నీ దివ్యరూపము! ని ప్రకాశము!

శా॥ తేజోరాశి! జగద్గతీ! ద్యుతిమతీ! ధీమన్మణీ! దివ్య ని
ర్వ్యాజ ప్రేమరసైకచిత్త! సుమనో- వ్రాతస్తుత్యా! ఫుల్లస
ద్రాజీవాంబక! లోకమాత! కరుణన్ - రక్షించితే! దీనుఁడన్
నీ బాడన్ గనుఁగొంటిఁ బ్రోవఁ గదవే! - నిత్యానుకంపానిధీ!

దండకము:— శ్రీవిశ్వవాణీ! ఘననీలవేణీ! గదాఖడ్గపాణీ! త్రిలోకైక రాణీ! బృహజ్జృంభవాణీ! ప్రపంచంబు సృష్టింప, రక్షింప, శిక్షింప, భక్షింప నీవేగదా! తల్లి! యో కల్పవల్లీ! విశేషించి నీ మాయఁ జూడన్, ఘనంబో, స్థిరంబో, బళీ! నిన్ను వర్ణింప నే నెంతవాఁడన్? జడుండన్ దురంతగ్రహోదగ్ర మూర్ఖుండ, భీభత్సరౌద్రాతిరేఖన్ గనుంగొన్న భీతిన్ జనింపన్ గణింపన్ వికాసంబు లేకున్నవాఁడన్, భవన్మూర్తి నేఁ జూడ నాకంపమున్ బొందితిన్ జిక్కితిన్ సొక్కితిన్ నీవు సౌమ్యాకృతిన్ దాల్చి రక్షింపు మమ్మా! జయం బిమ్ము యమ్మా! మమున్ జేర్చుకొమ్మా! భవన్మూర్తి నా చూపులం దెప్పుడున్ లీలనాట్యంబుతో దివ్యతేజంబుతో గోచరింపం గదే! మాత! నిర్ణేత! యో సత్యసంధాత! సంపూజితా! దేవతా! శ్రీయుతా! మా కులంబందు నెట్టిట్టి లోపంబు లున్నన్, భవత్పాద పంకేజ యుగ్మంబె గాదా శరణ్యంబు, యాథార్థ్యమా, సత్యమా, నిత్యమా, యు

మ్మలో, సౌఖ్యముల్ దోటి మన్నింపు మమ్మా! కృపఁ జూడు మమ్మా! భవ ద్దాసుఁడఁ శ్రీలసద్రూపిణీ! విశ్వమాతా! జగత్పూత! సత్పుణ్యభాగీ! నమస్తే! నమస్తే! నమస్తే! నమః॥

(కుసుమాంబా కుసుమశ్రేష్ఠులు వాసవి కాళ్లపైఁ బడుదురు.)

వాసవి:— నాన్నా! అమ్మా! లెండు! భయపడ వలదు.

కుసుమాంబ:— తల్లీ నీవు పరమేశ్వరి వని యింతవఱకును దెలిసికొనలేక పోతిని. క్షమింపుము. తల్లీ! క్షమింపుము. నీవే మా యింట నుండ నింక మా కేమి భయము?

వాసవి:— తల్లీ! యిటు కూర్చొనుము. తండ్రీ! నీవు గూడఁ గూర్చుండుము. నాన్నా! నే నొకటిఁ జెప్పెదను జేసెదవా?

కుసుమ:— అవశ్యము చేసెదను.

వాసవి:— (తలిదండ్రుల మధ్యఁ గూర్చుండి) నాన్నా! అమ్మా!

గీ॥ జరుగుచున్నవి యిఁకదింక - జరుగఁ బోవు
సంగతుల నెల్ల లోకంబు - లం గనంగ
నాకుఁ దెలియని దొక్కటై - నఁ గలుగునె
నాయనా! యిది యంత నా - మాయ గాదె?

తండ్రీ! ఈ దృశ్యమును మాత్ర మెవ్వరికిని దెలియనీయ రాగు సుమా! అమ్మా! నీవును హృదయమున నే యుంచుకొనుము. నాన్నా! వినుము.

సీ॥ నాపైన ధారుణీ - నాథుండు ప్రేమిన
మోహ వృత్తాంతం బ - మోఘమనుచు,
నీచాత్ముఁడగు రాజు - నిత్యం బవశ్యంబు
మిముఁ బెట్టు బాధ ల - మితము లనుచు,
ఆ మదాంధుని కై మ - హాభయంబున మీరు
చేయు యత్నంబు ల - శేష మనుచు,
మనవారు నాకుగా - దినము నొందెడి పాట్లు
కరము పశ్చాత్తాప - కరము లనుచు,

గీ॥ ధారుణీశుండు నే డిందుఁ - దరలి వచ్చి
చేయఁగారాని చెడుపనుల్ - చేయఁ దలఁచి
నాయ మింతైన లేకయు - న్నాఁ డటంచు,
నెఱుఁగుదును నేను, జింతిల్ల - నేల తండ్రీ!

తండ్రీ! పరిణయముమాట మరువుము. నీ కర్తవ్యమును దెలిపెద తండ్రీ! ప్రజానీకము తాము నమ్మిన ధర్మమును నిరాటంకముగా నిర్వర్తించుకొనుట కవకాశము నిచ్చుటకును, స్త్రీలు కేవలము బానిసలుగా నుండక స్వీయ ధర్మము నెఱింగి వ్యక్తి స్వాతంత్ర్యము గలిగి యుండుటకును, మూర్ఖత్వమున నిందుల కడ్డు వచ్చి యాటంకపఱచువారిని శిక్షించుటకును, ధర్మసంస్థాపనార్థమై నే నిప్పుడు జన్మించితిని. ఈ ఘట్ట మిప్పుడు పరిపక్వమైనది. సమాప్తి యగు సమయము గూడ సమీపించినది. మాఱు మాటాడక నాకై యొక యగ్నిగుండము నాయత్తపఱుపుము. విష్ణువర్ధనుఁడు దండు వెడలివచ్చు లోపల, నే నా గుండము దరికిఁ జేరి వణిజలోకమున కాదర్శక మగు ధర్మములను గొన్నింటిని బోధించి తేజోవంతి మగు గుండమునఁ బ్రవేశింతును.

కుసుమాంబ:— అగ్ని ప్రవేశమునకు సాహసింతువా, తల్లీ!

వాసవి:—తల్లీ ! నాన్నా ! యిటురండు. నా హృదయ భావమును వినుండు.

సీ॥ భక్త శేఖరుఁడైన - పతితపావనుఁడైన
కుసుమ శ్రేష్ఠియె నాకుఁ - గూర్మి తండ్రి,
సాధ్వీమతల్లియై - శ్యకుల కల్పకవల్లి
కుసుమాంబయే నాకుఁ - గూర్మి తల్లి,
తన జీవితము సంఘ - మున కర్పణముఁ జేయు
బాలవీరు లె నాకుఁ - బరమహితులు,
నా యందుఁ బ్రేమంబు - నఱ మనుచుండెడి
వణిజులే నా మెచ్చు - భవ్యమతులు,

గీ॥ ప్రమద మలరార జన్మ జ - న్మములకైన
స్వాంతమున మిమ్ము మరువంగఁ - జాలనింక,
మోహదర్పంబునన్ నన్ను - ముట్ట నున్న
పృథివినాథాధమున కింక - బెఱవకుండు.

తండ్రీ ! మఱి యొక విషయము. విరూపాక్షుఁ డెవరో తెలియునా ? నా యనుజుఁ డగు నీశ్వరుఁడు. ఈతని హస్తమున విష్ణువర్ధనుని మరణము తటస్థించును.

కుసుమ :—మన విరూపాక్షుఁడు సాక్షాదీశ్వరుఁడా ! ఆహా! మే మెంత ధన్య జీవులము !

వాసవి :—తండ్రీ! గుండ ప్రవేశమైన పిమ్మట జరుగవలసిన కర్తవ్యమును మన విరూపాక్షుఁడును నాలనగర సంఘము వారును జూచుకొందురు. న్యాయ మెప్పుడును సత్ఫలము నిచ్చును. ముందు నీవు పోయి, ఆ ప్రయత్నములను జేయింపుము తండ్రీ!

కుసుమ :—అవశ్య మటులనే చేసెదను తల్లీ! పోయివత్తును.

(వెడలి పోవును.)

కుసుమాంబ :—(వాసవిని వొడిపైఁ గూర్చుండఁ బెట్టుకొని) తల్లీ! నీ వెన్ని చెప్పినను నీపై నున్న పుత్రికా వాత్సల్యము ముప్పిరి గొనుచున్నదే గాని తగ్గకున్నది.

వాసవి :—తల్లీ! మాతృప్రేమ మితము లేనిది గదా? అమ్మా! నీ యనురాగమును నీ ఋణమును ఎట్లు తీర్చుకొందును తల్లీ!

(ఆలింగనముఁ జేసికొనును.)

## చతుర్థరంగము.

## కుసుమశ్రేష్ఠి సౌధము.

(కుసుమశ్రేష్ఠి, కుసుమాంబ, వృద్ధదంపతులు కొందఱు వచ్చియుందురు.)

కుసుమ :—వణిజకులోత్తంసులారా! మొన్నటి సభలో జరిగిన విషయము లన్నియు మీ కెల్లరకును విశదమే గదా? నా నిశ్చయమును తెలియఁబఱచియే యున్నాను. మీరును స్వయముగా వచ్చినందుకుఁ గృతజ్ఞుఁడను. తిరస్కరించుటకు వీలు కానపుడు అగ్నిప్రవేశ మగుట స్త్రీకి ధర్మము. మన వాసవి గుండ ప్రవేశ మగుటకే నిశ్చయించుకొనినది. అందులకుఁ దగిన యత్నములఁ జేయుచున్నాను.

కుసుమాంబ :—వాసవి మా బిడ్డ, ఆ కన్యక తనువును త్యాగముఁ జేసిన పిమ్మట మేము జీవింప లేము. శరీరము నీటి బుగ్గవంటిది. ఈ మా దంపతుల మిరువురము వాసవితో నగ్నిఁ బ్రవేశించి దేహములఁ ద్యజించెదము.

కాత్యాయని :—వాసవీ సంకల్పమును దెలిసికొనిన పిమ్మట, మా వృద్ధ స్త్రీ సంఘ మంతయు గుండప్రవేశ మగుటకు నిశ్చయించుకొనినది. వాసవి మీ బిడ్డయే గాదు, మాకును పుత్రికయే. ఈ వార్తను దెలియఁజేయుటకై వచ్చియున్నాము.

భీమయ్యశ్రేష్ఠి :— స్త్రీలే గాదు, వృద్ధ పురుష సంఘము గూడ నిందుల కంగీకారమును దెలుపుచున్నది. వాసవిని ప్రేమించునది తల్లులే గాదు: తండ్రులు మగు మాకును నామెయెడ నెక్కువ యనురాగము గలదు. దేహములు జీవాత్మ ధరించు దుస్తులు, అస్థిరములు, జడములు; వానిని విడచుటకుఁ బెనుగొండలోని వృద్ధ దంపతు లందఱు సంసిద్ధులై యున్నారు. ఈ విషయము నెఱింగించుటకే నేనును వచ్చియున్నాను.

కుసుమ :— నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. ధర్మసంస్థాపనార్థము వేఱు విధము లేనపుడు, దేహత్యాగ మొనర్చుటయే యుత్తమపథం బని మన ప్రాచ్యులు వచించియున్నారు. పితృకపందల పై పారిపోయినను, మానము సౌఖ్యము ననుభవింప లేము. మీ యభీష్టానుసారము కార్యక్రమముల నిర్వహించుటకై బూని యుండెదను.

దంపతులు :— సెలవు. (నిష్క్రమింతురు.)

## పంచమరంగము.

### సైనిక శిబిరము.

(సేనాధిపతియు సేనానాయకులును గూర్చొని యుందురు.)

1వ సేనానాయకుఁడు :— కొత్వాలు ప్రభూ! పెనుగొండ నగరవణిజుల యొక్క నిర్ణయమును వారి ప్రతిజ్ఞను వినియే యున్నారు. తమ యభిప్రాయ మేమి?

కొత్వాలు :— ప్రతి మానవునకును హృదయ మనునది యుండును గదా? వారు ధర్మమును న్యాయమును నిలుపుకొనుటకై ప్రాణత్యాగమును జేయుటకు సాహసించినపుడు......

కోదండుఁడు :— కొత్వాలుగారూ! మన మనరాదు గాని, ఈ విషయములో మహారాజుగారు మిక్కిలి ద్రోహముఁ జేయుచున్నా రనియే నా తలంపు.

కొత్వాలు :— సందేహ మేమి? మనము మాత్ర మానాటినుండియు మహారాజుగారి యాజ్ఞానుసారము దుష్ప్రచారముఁ జేసియుండ లేదా?, ఆత్మ విరుద్ధమైనను, బొట్టకూటికై యెంతటి కార్యములకైనను సాహసించి యుంటిమి గద!

2వ సేనానాయకుఁడు :—ఈ యుద్యోగములోఁ జేరిన పిమ్మట యెన్ని క్రౌర్యములను జేసియుంటిమో గదా! ప్రభూ! హృదయానుసారముఁ బ్రవర్తించుటకుఁ గనీసము కాకికైనను స్వేచ్ఛ గలదు గాని, మన కది లేక పోయినదే! పాప మీ పెనుగొండ వణిజులు సాధువర్తనులు. అనాథులును అన్నార్తులును నగు ననేకులను బోషింపుచుండువారు. ఎంత వ్యవసాయాభివృద్ధి? ఎన్ని పరిశ్రమలు? నిత్యమును వారివలన నెందఱో జీవించుచున్నారు గద! దిక్కు లేనివారికిఁ బెనుగొండ బంగారుకొండ. అట్టివా రీనాఁడు ప్రాణత్యాగమును జేయుటకు సిద్ధముగ నున్నారే!

కోదండు:—కొత్వాలుగారు! మనము గూడ నేదేని ఒక నిశ్చయమునకు వచ్చిన యెడల బాగుండునని తోఁచుచున్నది. ప్రపంచముపై నెన్నియో కోట్లు జీవరాసులు జీవించుచుండ, ఉద్యోగములు లేనిచో మనము జీవించలేక పోదుమా? కేవల మిట్టి యన్యాయములకుఁ బాల్పడుటకంటె మన కర్తవ్యమును నిర్వహించుటయే మే లని తోఁచుచున్నది.

కొత్వాలు:— అట్లయిన మనము మహారాజుగారి యుప్పుఁ దినుటచే వారిని ధిక్కరించకపోయినను, రణ మొనర్పవలసినట్లు పరిణమించినచో నీ పెనుగొండ నగరవణిజుల జోలికైనను బోవక తటస్థముగ నుండుట యుక్తమని తోఁచుచున్నది.

అందఱు:— అవును. బాగున్నది. అట్లే చేయుదము.

కొత్వాలు:— కోదండా! నీ వీ సేనానాయకులను వెంటబెట్టుకొని పోయి, మన నిర్ణయమును సర్వసైన్యములకును రహస్యముగాఁ దెలియజేయుము.

కోదండ:— చిత్తము.

(నిష్క్రమింతురు)

## చతుర్థాంకము.

### ప్రథమ రంగము.

### రాజమహేంద్రవరమున రాచనగరు.

విష్ణు:—(ఏకాంతముగా) పెనుగొండవారు మాత్ర మంగీకరించి యుండ లేదా? పెనుగొండ నగరస్వాములు తప్ప తక్కిన పదునేడు పట్టణములవారును నా కెక్కువ యనుకూలముగా నున్నా రనియుఁ బెనుగొండ వారిని గూడ

నెట్టులైనను నా పక్షమునకే త్రిప్పి, పరిణయ ప్రయత్నములఁ గావింతు మనియు తిప్పయ్యసెట్టి మొదలగువారు వార్తల నంపియున్నారు. వారివి గూడ సురక్షితముగనే యున్నదని కొత్వాలువద్ద నుండి వార్తలు వచ్చు చున్నవి. కాని నిర్ణయించుకొనిన గడువు రేపటితోఁ బూర్తి యగుచున్నది గదా? కర్తవ్య మేమి? ఎవరురా అక్కడ?

భటుఁడు :—(ప్రవేశించి) చిత్తము ప్రభూ! ఏమి సెలవు?

విష్ణు :—మన ప్రధాన మంత్రి విజయశీలుని పిలుచుకొని రమ్ము.

భటుఁడు :—చిత్తము. (పోవును)

కుందన :—(ప్రవేశించి భర్త పాదములకు నమస్కరించి, ప్రక్కనఁ గూర్చుండును) నాథా! మోమునందు వికాసము లేకున్న దేమి?

విష్ణు :—ఏమియును లేదు ప్రేయసీ! నా కేమియు ఆరోగ్యము సరిగా నున్నట్లు లేదు. నీ వెందులకు ఎప్పుడు విచారములో నుండెదవు? అంతః పురమున నుండి హాయిగ సర్వ సౌఖ్యములఁ ననుభవింపుచుంటివి. నా కేవో రాజకార్యము లనేకము లుండును గదా? ఆలోచించుచున్నాను.

కుందన :—ఒకప్పుడును మీ హృదయమున సంతోష ముండదు గదా!

చ॥ కనదురురత్నశైలములు, - కాంచన రాసులు తూల తల్పముల్,
ఘనతరచంద్ర శాలలు, న - గాధ జలాకర పుష్పవాటికల్,
మనమున కింపుఁగూర్పనను - మానము మానుచు సౌఖ్యసంపదల్
మనము భుజింపకున్న, కను - మా! యిఁక జీవిత మేల కొల్పనా?

విష్ణు :—దేవీ! ఎందుల కట్లు విచారపడెదవు? అంతఃపుర కాంత లెంద రున్నను నిన్నే యెక్కుడ మక్కువతోఁ బ్రేమించుచుంటిని గదా?

కుందన :—మీ సంపూర్ణానురాగమే యున్న యెడల నా కింకఁ గావలసిన దేమున్నది? కాని నిన్న రాత్రి నా కొక దుస్స్వప్నము వచ్చినది నాథా!

విష్ణు :—ఏమది?

కుందన :—ఎవరో ఒక రాజ పుత్రుఁడు సౌందర్యవతి యగు నొక కన్యకను జూచి, మోహించి వెంబడించగా, నా కన్యక శ్మశానమువఱకును బరుగిడి, నిజ హృదయాగ్ని రగుల్కొన, స్వయముగాఁ దాను మండిపోయినది. అప్పుడా రాజ యువకుఁడు తీవ్ర కోపములోఁ దిరిగి వచ్చుచుండగా నొక

ఫ్రాము కాటు వేసినది. వెంటనే యా రాజపుత్రుఁడు మరణించినాఁడు. అంతలోఁ జంద్రోదయ మైనది. నాకును మెలకువ వచ్చినది. నా శరీర మాకంపము నొందగా నేమియుఁ దోచక జ్యోతిషుని రావించి స్వప్న వృత్తాంతమును జెప్పితిని. స్వప్నమున శ్మశానము గనుపించినను, సర్పములు గనుపించినను, భర్త పంచత్వము నొందు నని ఆతఁడు జెప్పెను. అప్పుడు నాకు ధైర్య మాగక, దీనికి నుపశాంతి యే మని వేడుకొనగా, సూర్యోపాసనముఁ జేసినయెడల యీ దోష ముపశమించు నని చెప్పి యున్నాడు. ఈ నాఁడే సూర్యభగవానుని పూజను బ్రారంభించినాను. వారము రోజులు చేయవలెనఁట. ఈ వారము గడచువఱకుఁ దాము స్వీయ సౌధము విడిచి యెక్కడకును బోవల దని నా ప్రార్థన.

విష్ణు:—(చిరునగవున) పిచ్చిదానా! ఈ గోరంత నేనా కొండంత చేయుచున్నావు? స్వప్నమున ననేక దృశ్యములు గోచరించుచుండును. ఎప్పుడైనను కల్ల నిజ మగునా? ధైర్యవంతుల నివి చలింపఁజేయజాలవు. నీ వేమియు వెఱవవలదు, పొమ్ము. నిశ్చింతగా నుండుము. నా కిపుడు కొన్ని రాజకార్యము లున్నవి. నీ పనులలో నీ వుండుము.

కుందవ:—చిత్తము. (వెడలి పోవును.)

విష్ణు:—(యోచింపుచుండును)

విజయశీలుడు:—(ప్రవేశించి నమస్కరించును.)

విష్ణు:—విజయశీలా! రమ్ము. ఇటు కూర్చుండుము.

విజయ:—(కూర్చుండి) ప్రభూ! పెనుగొండవారి విషయములో మనము నిర్ణయించిన గడువు సమీపించినది గదా?

విష్ణు:—అవును విజయశీలా! మనము సైన్యముతో బయలుదేరి ఆ పెనుగొండ పట్టణమును నాశన మొనర్చి, అనుకున్న ప్రకారము వాసవీ కన్యకను బాణిగ్రహణముఁ జేసికొని తీరవలయును.

విజయ:—అందుల కింత ప్రయత్న మవసరము లేదు ప్రభూ! యుద్ధము మాత్ర మెందులకు? పదునేడు పట్టణముల వా రేకగ్రీవముగ నంగీకరించి నపుడు, పెనుగొండవారు మాత్రము సమ్మతింపకపోదురా? ఏదో యొక కారణము వలన నింతవఱకును వారి యంగీకారమును దెలుపక పోయియుండవచ్చును. అయినను మనము కొంత బలముతోఁ బ్రయాణము గుదము. పెనుగొండ

యందుఁ దగినంత దళ మిందునే యున్నది. పరిస్థితి విషమించినను ఒక్క పెనుగొండను వశపఱచుకొనుట కెంతబలము కావలయును?

విష్ణు:—విజయశీలా! ముందు నీవు పోయి, ఈ నాటి సాయంతరమే ప్రయాణ మగుటకుఁ దగిన సన్నాహములఁ గావింపుము.

విజయ:— చిత్తము. అటులనే చేసెదను. సెలవు. (విజయశీలుడు వెళ్లును.)

భటుడు:—(ప్రవేశించి నమస్కరించును) మన సేనాధిపతిగారు వచ్చినారు ప్రభూ!

విష్ణు:— వెంటనే తోడ్కొని రమ్ము.

సేనాధిపతి:— (ప్రవేశించి ప్రణమిల్లును.)

విష్ణు:— సేనాధిపతీ! ఏమి విశేషములు?

సేనాధిపతి:—ఇంకే మున్నది ప్రభూ! మన విక్రమసింహుఁడు—

విష్ణు:— విక్రమసింహుఁడా? ఏమి?

సేనాధి:— అస్తమించెను.

విష్ణు:—మరణించినాఁడా? ఇది యేమి సేనాధిపతీ? నీవేనా యీ మాటలను జెప్పి వినుపించునది?

సేనాధి:— అవును ప్రభూ!

విష్ణు:— ఎందువలనఁ ద్వరగాఁ జెప్పుము?

సేనాధి:— ఆ పెనుగొండ పట్టణమును దా నొక్కఁడే నాశనము చేసివచ్చి తమకు సంతోషముఁ గలిగింతు నని పలుకుచుండిన వీరుఁ డస్తమించెను ప్రభూ!

విష్ణు:—అవును. అట్టి వీరుఁడే.

సేనాధి:— నేడు ప్రభాతమున వీచిన సుడిగాలి మన సేనలకుఁ జాలా యిక్కట్టు కలుగఁ జేసినది. విక్రమసింహుఁడు వజ్రాయుధమను నశ్వము నెక్కి తరలుచుండఁగా, నది అతనిని నేలబడఁద్రోసి త్రొక్కి చంపివేసినదట.

విష్ణు:— అహా! ఎంత కష్టము? నా దక్షిణ హస్తము విఱిగి పోయినది. హా! శూరాగ్రేసరా! నీ కెట్టి మరణము ప్రాప్తించినది! విక్రమసింహా! నీ వలన

నే నెన్ని విజయముల నొందితిని, (మధుపానముఁ జేయుచు) చని పోయిన వానిని గుఱించి యనుకొనుచుండిన నేమి ప్రయోజనము? దండయాత్రను మానరాదు. సేనాధిపతీ! నీవు సత్వరము పోయి, విక్రమసింహుని యంత్య క్రియలకుఁ దగిన యేర్పాటులను నిర్ణయించి స్వల్పసైన్యముతోఁ బెనుగొండకుఁ దరలుము. నేను వెంటనే బయలు దేరుచున్నాను.

సేనాధి:— తాము సెలవిచ్చినట్లు, ఏ కొలఁది తురగారోహులనో తీసికొని వెళ్లిన చాలును. సెలవు. (నిష్క్రమించును.)

విష్ణు:— విక్రమసింహుని మరణము వింతగా నున్నది. నా హృదయ మెందువలననో కలవరపడుచున్నది. ఇందుకు కారణ మేమియును లేదు. కారణము లేని మనో వైకల్యము ధైర్య లక్షణము కాదు. ధైర్యమా! నన్ను విడనాడకుము.

భటుఁడు:— (ప్రవేశించి) ప్రభూ! మన సారథి రాజభట్టు వచ్చినాఁడు.

విష్ణు:— రాజభట్టా? రమ్మను. వేళ కావచ్చినది.

రాజభట్టు:— (ప్రవేశించి, వంగి నమస్కరించును.)

విష్ణు: ఏమి రాజభట్టా! రథము సాయత్త పఱచితివా?

రాజభట్టు:— లేదు ప్రభూ! ఇంకేమి రథము?

విష్ణు:—అదేమి, అట్లనుచున్నావు సారథీ?

రాజభట్టు:— ఏమి చెప్పుదును ప్రభూ! తమ యాజ్ఞవిని రథ మలంకరించుకొని వచ్చుచుంటిని. దారిలోఁ బ్రళయ కాల వాతూలమో యనునట్లు, పెనుగాలి వీచి, లోతుగా వేళులు పారియున్న వృక్షముల సైతము పెకలించి పడి, గజ తురగాదులు బెదరి పోయినవి. అట్టి సమయమున విజయ రథ ధ్వజము విఱిగి పడి పోయినది, ప్రభూ!

విష్ణు:— దీని కేనా, పెద్ద ప్రమాదము వచ్చినట్లు పలుక వచ్చితివి? పొమ్ము. మఱి యొక రథము సాయత్త పఱచుకొని రమ్ము.

రాజభట్టు:— చిత్తము. అట్లే చేసెదను, ప్రభూ! (నిష్క్రమించును.)

విష్ణు:—(యోచించి) ఎడమ భుజ మదురుచున్నది. ఇది యేమియో! అన్నియు నపశకునములు గలుగుచున్నవి! దండయాత్ర సమయమున నధైర్యమునకు చెడ మీయరాదు. ధైర్యమే సర్వార్థ సాధకము. నా కిప్పుడు వచ్చిన

లోటేమి? ప్రమాదము కలుగుటకు నవకాశము లేదే? (మధుపానముఁజేసి) నాకేమి భయము? సంఖ్యకు మించిన సైన్యము లున్నవి. పెనుగొండ యన వణిజుల పట్టణము. దానిని బట్టుకొను టెంతటి పని? తలపడిన పనికి వీరులు వెనుదీయ రాదు. ఇప్పుడే పోయి పరిణయ మాడెదను. లేక నా కసి దీరు కొందును.

గీ॥ పిఱికి పందలు శకునాల - పేరు విన్న
దడియఁ బడి చచ్చిపోదురు - ధరణిసతము
ధైర్యవంతులు దానికై - దడియ రెపుడు
పూను కొనినట్టి కార్యంబు - మానరాదు.

— ఎవరురా అక్కడ?

భటుఁడు:— (ప్రవేశించి) చిత్తము ప్రభూ! ఏమి సెలవు?

విష్ణు:— మన సారథి రాగానే ఆయుధ శాల వద్దకు రమ్మని చెప్పుము. నే నక్కడనే యుందును. (నిష్క్రమించును)

## ద్వితీయ రంగము.

### కుసుమశ్రేష్ఠి గృహము.

(కుసుమసెట్టి, కుసుమాంబ, వాసవి, పెనుగొండ నగర వృద్ధదంపతులు వరుసగాఁ గూర్చొని యుందురు.)

కుసుమ:— పూజ్యులారా! మా దంపతుల మిద్దరము వాసవితో నగ్నిగుండ ప్రవేశ మగుదు మని మీ కెఱింగించియే యుంటిని. మీ యెల్లర నిర్ణయమును గూడఁ దెలిపియే యున్నారు. రేపు మహారాజుగారు వచ్చు దినము. నేఁడే భానుండు గ్రుంకు సమయమున గుండ ప్రవేశ ముహూర్తమును నిశ్చయించినాము. పరమేశ్వరీ దేవాలయమువద్ద నూటమూఁడగ్ని గుండములను సిద్ధము చేయుచున్నారు. ఈ ఘట్టమున నెవ్వరికిని నిర్బంధము లేదు. గుండ ప్రవేశమున కిచ్చగించువారు మాత్రమే వీర కంకణములను ధరింప నగును. తక్కిన వారు మానవచ్చును. పసుపు కొమ్ములతోఁ గట్టిన కంకణము లివిగో యెదుట నున్నవి.

ధనదుఁడు:—(లేచివచ్చి) మేలు, మేలు, సాయకోత్తమా! వాసవీ మాతయు మీ దంపతులును అగ్ని ప్రవేశ మగుచుండ మేము మూరకుండగలమా? యుద్ధము చేయఁజాలని వృద్ధులము. రాజుచే బంధింపఁబడి వెతల నొందుట కన్న స్వేచ్ఛమై ప్రాణములు వీడుట మేలుగదా? మన వర్తనము కలువవర్తనుఁడగు విష్ణువర్ధనుని పశ్చాత్తప్తునిగఁ జేయ వలయును. ఇదిగో మేము మిరువురము వీరకంకణముల ధరించుచున్నాము. (అని భార్యాభర్త లిరువురు వత్తురు.)

కుసుమ :—ధనదా! ఆగుము. మీరు సంతానము లేనివారు. మీకీ త్యాగము తగదు. మీరును వంశకర్త లగుటకుఁ గాను జీవయాత్ర సలుపఁదగును.

తిమ్మప్ప:—అవును. మే మెల్లరము గుండప్రవేశ మగుచుంటిమి గదా? నీవు సాహసింపకుము ధనదా!

ధనదుఁడు:—కుసుమశ్రేష్ఠిగారు! మా సంకల్పమునకు మీ రడ్డు రావల దని వేడుకొనుచున్నాము. మా వంశ మున్నను లేక పోయినను బాధ లేదు. కర్తవ్యమును నెరవేర్చుటయే యుచిత ధర్మ మని నమ్మియున్నాము.

(భార్యాభర్తలు కంకణములను ధరింతురు. తక్కిన వారలు నట్లు చేయుదురు. మంగళవాద్యములు మ్రోగును. పుష్పములు లాజలు చల్లుచుందురు)

కుసుమ:— పరమేశ్వరీ దేవాలయము వద్దకు బయలు దేరుదము. కుసుమశ్రేష్ఠి గేయమును బాడుచు బయలుదేరును. అందఱును బలుకుచుందురు.)

గేయము:—

జై పరమేశ్వరి - జై పరమేశ్వరి
దీనదయాజలధీ! ॥ జై ॥
జనగణ మంగళ విధాత! మాతా!
జీవ సంపూజిత హృదయా! ॥ జై ॥
పాహి పాహి వణిజాన్వయ వాసీ!
పరమేశ్వరీ మతల్లీ! ॥ జై ॥
ఓంకార రూపిణీ! ఓంకార భాసినీ!
ఓంకార జనితా! పూజితా! ॥ జై ॥

(అందఱు నిష్క్రమింతురు)

# తృతీయరంగము.

## కుసుమశ్రేష్ఠి గృహము.

(విరూపాక్షుఁడు, ప్రభాకరుఁడు, అనంతుఁడు, మురహరి, మొదలగు బాలనగరులు కూర్చొని యుందురు. అందఱు విషాదగ్రస్తులుగ నుందురు.)

ప్రభాక:— (దీనముగా) విరూపాక్షా! ఇంక మన కర్తవ్య మేమి?

విరూ:— (యోచించుచుండును)

అనంతు:—అబ్బ! ధర్మ ప్రతిష్ఠాపన సంతసింప దగిన దైనను, ఒకవైపున పౌరుష మినుమడించుచున్నను, పట్టరాని దుఃఖమే ప్రబల మగుచున్నది.

విరూ:— మిత్రులారా! గుండప్రవేశ దృశ్య మింకను నాకుఁ గన్నులకు గట్టినట్లున్నది. ఆహా! పరమేశ్వరీ! నీ తత్త్వ మూహాతీతము గదా! సఖులారా! ఎంత తడవని శోక పరవశ నిశ్చేష్టుల మగుట! మన కర్తవ్యము నాలోచించుకొని కార్యరంగమున దిగవలెను. మిత్రమా! మురహరీ! మఱల నొక్కపరి వాసవీమతల్లి గావించిన బోధను వినిపింపుము.

మురహరి:— మిత్ర వతంసులారా! మన వాసవీ వతంసము దేదీప్యమాన మగు తేజంబుతో విరాజిల్లుచు గుండంబును సమీపించుదరికి, హా! వాసవీ! హా! లోకమాతా! యని నుతింపనివారు లేరుగద! కొందఱు భక్తి పారవశ్యముచే నొడలు మఱచి భజనలను జేసిరి. ఆయమ యనురాగ కటాక్ష వీక్షణములతో నందఱి మనస్సు లుప్పొంగినవి. దేహములు పులకరించినవి. అప్పుడు వాసవీకన్యక అందఱికిని గొంత తడవు లోకమాతను నుతింపుమని చెప్పి, పెద్దలకు నమస్కరించి, బాలనగరుల నాశీర్వదించి, మనలనుగూర్చి యిట్లు వచించినది. నాయనలారా! మీ జీవితములయందే గాక, మీ వంశములయందును ఈ నియమములను దప్పవలదు. సర్వదా యీ నీతులకు బద్ధులరై యుండవలెను.

మ॥ అరి షడ్వర్గములన్ జయించి భువిలో - నత్యంత విఖ్యాతి, వె
ల్గిరి మీరల్ గడు ధన్యమానసులు, కా - ళీశర్వు లానందముల్
గరముల్ బొందిరి మీ తపంబులకు, దు - ష్కార్యుండు దస్యుండు నా
ధరణీకాంతుఁడు మిమ్ముఁ జేరఁగలఁడా? - ధైర్యంబు మీ కుండినన్.

సీ॥ పరకామినులను స్వ - ప్నంబులందైనను
　　　　సోదరీ మణులట్లు - చూడరయ్య,
కష్టంబులన్ బ్రోచి - నష్టంబులకు నోర్చి
　　　　కులధర్మమును నిల్పఁ - దలపరయ్య,
సర్వ జీవులపట్ల - సానుభూతిని జూపి
　　　　హృదయ మాలిన్యంబు వదల రయ్య,
న్యాయమార్గమున ధ - నంబు నార్జన జేసి
　　　　విత్తాధిపులు గా - వెలయ రయ్య,

గీ॥ ఇలను క్షుద్బాధ నంత వా - రింప రయ్య,
సర్వ మానవ సేవయు - సంఘసేవ
దేశసేవ భాషాసేవ - శ్రీశు సేవ
మఱువ వలదయ్య, యెన్నిజ - న్మలకైన॥

సీ॥ వాణిజ్య మభివృద్ధిఁ - గాఁగ నుండిన
　　　　క్షామ నివారణ - గలుగు సతము,
కార్మిక పశుపాల - కర్షకావళిఁ బ్రోవ
　　　　ప్రజల సౌఖ్యంబులు - ప్రబలు చుండు,
పేదల వృద్ధుల - వికలాంగ జనముల
　　　　వాత్సల్యమునను గా - పాడవలయు,
నీతి వర్తనపట్ల - నియతి గలారలై
　　　　తప్పు సాక్ష్యములకుఁ - దరల వలదు,

గీ॥ భువిని వపహాసమునకైన - బొంక వలదు,
ఆత్మ సోదరీ మణుల క - త్యంతముగను
గౌరవస్థాన మొసఁగుచుఁ - గాంచవలయు,
ఎంచి హృదయ మ్మమలముగా - నుంచవలయు.

విరూపా :— సఖులారా! మన జీవిత కాలమునకైనను వాసవీమాత చెప్పిన నీతులకు బద్ధులమై, యాయను యాజ్ఞానుసారము ప్రవర్తించుట మన కనీస కర్తవ్యము.

ప్రభాకర:— మనము మహారాజు వచ్చినపుడు చేయవలసిన దేమి?

మురహరి:— అట్లు గాదు. మన మెల్లరము యోచించి, కార్యక్రమము నిర్ణయించుకొనవలయును. మహారాజు బలములతో వచ్చునుగదా!

విరూ:— మిత్రులారా! మన మందరము కోట గుమ్మమువద్ద కావలి యుందము. మహారాజు వచ్చిన వెంటనే వాసవి వృత్తాంతము నెఱుక పఱచి మఱలి పొమ్మనెదము; ప్రార్థింతము; కలయుచో నడ్డగించెదము. మనలో నొక్కనికైనఁ బ్రాణ ముండువఱకు రాజు కోటలోఁ గాలు పెట్టరాదు. మనము చచ్చితిమా, అందఱమును వీరస్వర్గము ననుభవింతుము. గెలిచితిమా, ఈ సామ్రాజ్యమున దౌర్జన్య మంతరించి, స్వాతంత్ర్యము స్థాపిత మగును.

అనంతు:— ఇట్లు చేయుట దౌర్జన్యము కాదా?

విరూపా:— కాదు. మన యుద్దేశ్యము దండయాత్ర కాదు. ఆత్మ సంరక్షణ.

మురహరి:— మన మందఱము మరణించినచో మన సోదరీమణుల గతి?

విరూపా:— వారు సుశిక్షితలు. వారి కర్తవ్యమును వా రిన్నాళ్లుగనో వాసవి నుండి గ్రహించియే యున్నారు. వారికి మన సలహాగాని రక్షణగాని అనవసరము.

మురహరి:— ఇంక దగిన ప్రయత్నములలో నుండవచ్చునా?

విరూ:— ఔను వెళ్లుదము, రండు. (నిష్క్రమింతురు.)

## చతుర్థ రంగము.

(తెరలోఁ గలకలము. మహారాజుతో వచ్చిన సైన్య జాలమునకును బాలనగరులకును యుద్ధము జరుగుచుండును. రాజ సైనికులు కొందఱు తాళజాలక తెర బైటికిఁ బారి వత్తురు. బాలనగరులు వెంబడించుచు వచ్చుచుందురు. హాహాకార రవములు వినఁబడుచుండును. పిమ్మట కొంత తడవునకు బాలనగరులు విష్ణువర్ధనుని బంధించి తీసికొని వత్తురు.)

మురహరి:— అనంతా! సత్వరము విరూపాక్షుని బిలుచుకొని రమ్ము.

విరూ:— (ఎదురుగా వచ్చుచుండును)

మురహరి:—ఓహో! విరూపాక్షా! రమ్ము! నీ కొఱకే వేచియున్నారము.

విరూ:— (ప్రవేశించి) ఏమిది? సర్వలోకాశ్రయ సార్వభౌముని బంధించుటయా! వలదు. వలదు. విడిచిపెట్టుఁడు. (సమీపించి) చాళుక్య సామ్రాజ్యాధీశ్వరా! వాసవి అగ్నికి ఆహుతి యైనది గద! మీ సంకల్పసిద్ధి బూడిద పాలైన పిదప వైర మెందులకు? స్వీయ నగరమునకు వెడలి, యపూర్వ సుఖము లనుభవింపవచ్చును. మిమ్ములను నిగ్రహించుట మా తలంపు కాదు. మా పట్టణ సంరక్షణమే మా యాశయము. మా హృదయములయందు మాకేమియుఁ గ్రోధము లేదు. మమ్ముల నన్యథా తలంపక మీరు మఱలి చాళుక్య సామ్రాజ్య సింహాసనము నధిష్ఠింపవచ్చును.

(బాల నగరులు మహారాజు బంధనములను విప్పుచుందురు.)

విష్ణు:— (తీవ్రమగు కోపముతో) మూర్ఖులారా! నన్నా బంధించునది! ఓరీ విరూపాక్షా! ఈ విధముగ నన్నవమానింపుచున్నావా? నే నుత్తమ క్షత్రియుఁడను. ఇదిగో కాచుకొమ్ము! నిన్నిప్పుడే నా కరవాలమునకు బలి యిచ్చెదను. (అని కరవాలముఁ దూసి పైకి పోవును.)

విరూ:— (కరవాలము దూసి) నీచా! ఇంకను నీ పౌరుషము చావకున్నదా? రమ్ము! నీ బల మెంతటిదో చూచెదను.

(బాల నగరులు రాజు చేతిలోనుండి ఖడ్గమును లాగివైచి రాజును పట్టుకొందురు)

విష్ణు:— ఆఁ అధములారా! నా ఖడ్గమును లాగివైచి, నన్ను చంపెదరా?

విరూ:— (ఖడ్గము నావలఁ బారవైచి) చంపను, చంపను. నిరాయుధుఁడవగు నిన్ను చంపను. ఇదిగో నేనును ఖడ్గమును విసర్జించినాను. నన్ను చంపఁ గోరుదువేని, నాతో ముష్టియుద్ధ మొనర్చి నన్ను గెలువుము. మీ రందఱును దూరముగా నుండుఁడు.

విష్ణు:—ఆఁ మూర్ఖా! ఇంత కావరమా? కాచుకొమ్ము. (ఎగిరి పైకి దూకును. విరూపాక్షుఁడును విష్ణువర్ధనుఁడును ముష్టియుద్ధ మొనర్తురు. కొంత తడవునకు విరూపాక్షుఁడు విష్ణువర్ధనుని క్రిందకుఁ ద్రోయగా, నతఁడు తల పగిలి నెత్తురు గ్రక్కుకొని చచ్చును. కరతాళ ధ్వనులు మ్రోగును).

(అవనిక పడును.)

# పంచమ రంగము.

## పెనుగొండ సభా మంటపము.

(పట్టాభిషేక మహోత్సవము, సింహాసనమును సిద్ధపఱచి యుందురు. విరూపాక్షుఁడు బాలనగరులు బాలవనితలతో వచ్చి యుందురు. రాజరాజనరేంద్రుఁడు విరూపాక్షుని ప్రక్కన ఉండును.)

రాజరాజ:—సభాసదులారా! నా హృదయాభిప్రాయములఁ దెలిపియే యుంటిని. నా తండ్రి దుర్మార్గకార్యములఁ జేసినాఁడని మీరు నిర్వచించి నందులకు నా కేమియు కోపము లేదు. పిన్నవాఁడ నైనను నేనుగూడఁ గొన్ని సారు లాయనను వారించి యున్నాను. కాని, ఆయన నన్నుఁ గన్న తండ్రి యగుటచే, ఆయన యెడలఁ గల ప్రేమానుబంధమును వీడఁజాల కున్నాను. సభ్యులార! మీ రొనర్చిన ధర్మ సంగ్రామమునకుఁ జాళుక్య సామ్రాజ్యమంతయు హర్షించఁ గలుగు. ఈ ఘట్టము మీ వణిజాన్వయమునకే గాదు. చాళుక్యాన్వయమునకుఁగూడ శోభను గూర్పఁగలదు. మీ వాసవీ మాత మీ వణిజ లోకమునకే గాక, సర్వ ప్రపంచమునకును బూజనీయురా లైనది. ఈ పెనుగొండ పట్టణ కార్యనిర్వహణమును మీ విరూపాక్షుఁడు కుశాగ్ర బుద్ధితోఁ జేయగలఁడు. ఈ ధర్మకిరీటమును నా కరములతో విరూపాక్షుని మస్తకంబున నుంచెద. (రాజరాజ నరేంద్రుడు విరూపాక్షుని సింహాసనాసీనునిఁ జేసి మస్తకమును కిరీటముతో నలంకరించును. కరతాళ ధ్వనులు వెలయును. మంగళవాద్యములు మ్రోగును. పుష్పవర్షము గురియును.)

విరూ: — (లేచి నమస్కరించును) నరేంద్రా! మీపై వ్యక్తిగతముగ మా కెవ్వరికిని కోపము లేదు. మీ తండ్రి చేసిన కార్యములకు మాత్రమే గర్హించితిమి గాని వేఱు ద్వేషము లేదు. విచారము మానుము. ఈ చాళుక్య సామ్రాజ్యమును ధర్మబద్ధముగ బాలింపుము. బాల వీరులార! సభాసదులార! నా హృదయాంజలిని గైకొనుఁడు. ఈ నాటక మింతటితో సమాప్త మైనది. మన వణిజాన్వయ మీ ఘట్టము నాచంద్ర తారార్కముగ స్మరించుచుండుఁగాక! శ్రీ వాసవీ ధర్మోపదేశములు బీజాక్షరములై సూత్రములై వెలుగొందుగాక! స్వీయాన్వయమున జన్మించిన వారలెల్లరు నీ యుపదేశములను మననముఁ జేసి, ఆచరణలో నుంచవలెను. సంతాన రహితముగు ధనద కులమును వాణిజ్యాదిప్రతికార్యారంభమునను స్మరింపు

చుండవలెను. ఇంకఁ బతాకను నెగుర వేయవచ్చును. (పతాకము నెగుర వేసి గేయముఁ బాడుదురు.)

గేయము:

వణిజ పతాకము - అంబర తలమున
        ఆడుచున్న దల్లదిగో! ॥వణిజ॥

విశ్వమాతయా - వైశ్యబాలయా
        వాసవాంబ అల్లదిగో ! ॥వణిజ॥

ద్వ్యుత్తర శతంబులు - దివి నక్షత్రంబులు
        గోత్ర సంజ్ఞ లల్లవిగో ! ॥వణిజ॥

క్షామ నివారణ - కళాపోషణము
        కార్య శూరత్వములు నవిగో ॥వణిజ॥

కార్మిక రక్షణ - కర్షక పాలన
        వణిజ కృత్యములు నవిగో ॥వణిజ॥



Printed at Renaissance Printers Ltd. T.Nagar, Madras. Copies 550—13-10-45

